JAGATI Rs. 2-00 July 1990

35th Year of Publication




## జులై - 1990

## సాహితీ సుధ

హృదయవచశ్శరీరముల నెంతయు బుణ్య సుధాప్రపూర్ణులై
ముదము బహూపకారముల మూడు జగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణ లవంబులు గొండలు సేసి మెచ్చుచున్
మదిన్ వికాసయుక్తులగు మాన్యులు గొందఱు వొల్తురిద్ధన్

—భర్తృహరి



పరపీడనముకంటె పాతకం బెయ్యది - సత్యమాడుట కంటె సరణి యెద్ది
అతిధిపోషణ కంటె నాచార మెయ్యది - వరవిద్య కంటె సద్వస్తు వెద్ది
పుణ్యశీలము కంటె భూషణం బెయ్యది - కృత మెఱుంగుట కంటె మత మ దెద్ది
తాలిమి కంటె నుత్తమ గుణం బెయ్యది - తామసంబున కంటె దౌష్ట్య మెద్ది
న్యాయపద్ధతి కంటె సన్మార్గ మెద్ది - పౌరుషోత్సర్జనము కంటె బన్న మెద్ది
దైవతంబెద్ది నీ కంటె దలచి చూడ - రామలింగేశ రామచంద్రపురవాస.

—రామలింగేశ శతకం

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 45-00 - 5 సం॥లకు రు. 100-00 - జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు.100-00

ముఖచిత్రం : 'కథాకళి'

# నిమ్మతొనలు

సుజాతా నీవు ఎంతో అదృష్టవంతురాలివి. ఒక్కోసారి నిన్ను తలచుకుంటే అసూయగా ఉంటుంది. నీ అంత అదృష్టవంతులు వుండరనుకో, - అంది కమల.

'ఏమిటేమిటి, ఎందకనట అంత అదృష్టవంతురాలిని ?'

'మీ వారు నీ మాట జవదాటరు. నీతో చెప్పకుండా ఏ పనీ చేయరు'

'ఓస్, అదా? పెళ్లికి ముందే ఒప్పందం చేసుకున్నాం. ఒకటో తేదీన తన జీతం నాకిచ్చేటట్టు - తనకి ఎప్పుడు ఎటువంటి ఖర్చు వచ్చినా, నన్ను అడిగి తీసుకొనేటట్టు. నేను ఏనాడూ 'కాదు' అనిగాని, 'ఎందుకు' అనిగాని ప్రశ్నించకుండా వుండేటట్టు!'

'ఏమైనా, నీవు తెలివైన దానివి, సుజాతా.'

'ఇందులో తెలివితేటలు ఏమున్నాయి ? పెళ్లికి ముందు కాబట్టి ఆ మోజులో విన్నారు. ఆరునెలలయాక అయితే, ఆ విన్నపం విని వుందురా ? .... సాయంత్రం అయిస్క్రీమ్ తీసుకొచ్చారంటే, మర్నాడు ఆయనకి డబ్బు కావాలని అర్థం'-అంది సుజాత.

—కె రామకృష్ణ
రేపల్లె

విన్నావా, శాంతీ, మా మరిది వెంకటాద్రికి వాళ్ల అన్నగారు ఒక పెళ్లి సంబంధం చూశారు. పిల్ల బావుంటుంది, బిఏ పాసయింది, సెక్రటేరియట్‌లో పనిచేస్తోంది.... ససేమిరా చేసుకోనంటాడు' - అంది సుగుణ.

'ఎవరినయినా ప్రేమించాడేమో' - అని ప్రశ్నించింది.

'అటువంటి దేమీ ఉన్నట్టు తోచదు - తలొంచుకు పోయే బాపతు.'

'మా పక్కింటి సుభద్రమ్మగారి కొడుకూ అంతే! వాళ్లమ్మగారు పెళ్లి సంబంధం నిశ్చయం చేయబోయేసరికి, హుస్సేన్ సాగర్‌లో దూకుతానన్నాడు,' అంది శాంతి.

'మా ప్రబుద్ధుడూ అంతే! 'పెళ్లి' అనేసరికి చచ్చిపోతానంటాడు.'

'సుభద్రమ్మగారి కొడుక్కి మల్లే మీ మరిదికీ బ్లూ ఫిలిమ్స్ రహస్యంగా చూడటం అలవాటేమో! వారు జీవితంలో ఎందుకూ కొరగాని వారవుతారట' — అని చెప్పింది శాంతి.

—సి నాగేశ్వరావు
సికింద్రాబాదు-3

కళ్లు పరీక్ష చేసి, అక్షరమాల చూపించి, అక్షరాలు చదవ

మన్నాడు డాక్టరు కైలాసం, పేషం టుని.... పేషంటు సహకరించపోగా, మొండికేశాడు. విసుగెత్తిన డాక్టరు గారు, 'కనీసం ఆ ఆర్టిపిక్చరైనా కని పిస్తోందా?' - అని అడిగాడు.

'కనిపిస్తోంది' - అన్నాడు పేషంటు.

'ఏమిటది ?'

'అర్ధనగ్నసుందరి'

డాక్టర్ కైలాసం తనలో తను నవ్వుకు, నాలుగురోజులు పోయాక రమ్మన్నాడు పేషంటుని.

—డి సత్యమూర్తి
వాడ్రేవుపల్లి

శ్రీనూ, నీవు 'స్కూల్లో ఎప్పుడూ ముందువరస బెంచీల్లో కూచుంటా వట అంత శ్రద్ధగా పాఠాలు వింటు న్నావా? నీ మార్కుల పట్టిక....'

'అది కాదమ్మా, అందులో ఒక రహస్యం ఉంది.'

'రహస్యమా'

'వెనుకవరసలో కూచుంటే మేస్టారికి కోపం వచ్చినప్పుడు డస్టర్ మొహం మీదికి విసురుతారు. ముందు వరస లో అయితే చేతితో కొడతారు. మొహం నిండా సుద్ద అంటుకునే డస్టర్ కంటె, చేతిదెబ్బ నయం' - అని వివరించాడు శీను.

—ఎ ఆర్ కృష్ణ
కోరుకొల్లు

ఉషాదేవి గర్వంగా చెప్పుకుంది మాధవితో: 'నేనేమో స్కూటర్ నడుపుతాను - మా ఆయన నా నడుం చుట్టూ చేయివేసి వెనక కూచుంటారు.'

'అయ్యోరామా, స్కూటర్ నడ పడం కూడా రాదా మీ ఆయనికి?'

ఉషాదేవి పక్కున నవ్వి అంది 'ఆయనకి రాకపోవడమేమిటి, ఆయనే కదా నాకు నేర్పింది. ఆయన వెనక కూచుని నేను స్కూటర్ నడుపు తూంటే, ఎంత రొమాంటిక్‌గా ఉంటుందో నీకేం తెలుసు, మాధవీ!'

—జి రాము
నందిగామ

# పాఠకుల లేఖలు

మిత్రులు శ్రీ చందూర్ గారికి: చిన్ననాటి ముచ్చట్లు' ఆనాటి మధ్య తరగతి కుటుంబముల వారి నిరాడం బర జీవితమునకు అద్దము పట్టినట్లు న్నది.... నేటి మధ్య తరగతి మృగ తృష్ణల వెంబడించు, లేళ్లే బృందము వలె నున్నారు.... కేసరిగారి అనుభవ ములు తెలుగువారికే గాక భారతీయ ప్రజలకు రత్నగర్భ యనుట సత్య దూరము కాదు.

—పియల్ నరసింహమూర్తి
మద్రాసు-93

శ్రీ చందూర్‌గారికి: నమస్తే.... తంజావూరు సభల్లో గుర్తుంచుకోదగి నది మాలతీ చందూర్ దంపతుల పరి చయం - నిజం! ఆ సభలు కవర్ చేసిన జగతి' పంపగలరు. మీ అభిమాని..

—కొండేపూడి నిర్మల
తిరువూరు

ప్రియమైన చందూర్ గారికి: నమ స్కారములు. 'జగతి' ప్రతినెలా పూర్తిగా చదివనిదే వొదలను. ప్రతిదీ, మీ డైరీ, కేసరిగారి ముచ్చట్లు, సాహితీ సుధ - దేనికదే హైలైట్. ముందుగా ఏదీ అనే ప్రశ్నరాదు. మహామేధావి జిడ్డు కృష్ణమూర్తిగారి చిత్రం వేశారు. చాలా సంతోషం. వారి గురించి, వారి ఆలోచనా విధా నము గురించి పరిచయం చేస్తే బావుం టుందని నా మనవి.... వీకెండ్స్‌కి ఢిల్లీ వస్తాను. కల్యాణి ఆలిండియా రేడియో స్టాఫ్‌ఆర్టిస్ట్‌గా జాయినయ్యింది. మొన్న నవంబరులో ఢిల్లీ వస్తారని చూశాము - ఎందువల్లనో రాలేదు. మాలతిగారికి, వారి అక్కయ్యగారికి మా నమస్కారములు.

—కె లక్ష్మీనారాయణ
మొరాదాబాద్ (యుపి)

చందూర్ గారికి హృదయపూర్వక నమస్కారములతో వ్రాయునది..... నా 'గల్ఫ్' సర్వీసుకి పదిసంవత్సరాలు పూర్తి అయినది. ఎన్ని ఇంగ్లీషు మాగ జైన్స్ దొరికినా, యిన్ని సంవత్సరాలు గా నా నేస్తం 'జగతి' - కాలక్షేపా నికి నవల్స్ వుంటాయి; లేదా, టివి - విసిఆర్ లు వుంటాయి. కాని, ఎదురు చూసేది 'జగతి' కొరకే! ఎన్నో అపూర్వ విషయాలు, వెలగట్ట లేనివి తెలుపుతుంది ఈ పత్రిక. సాహితీ సుధలోని పద్యాలు చదవ డానికి కఠినంగా ఉండవచ్చు, కాని, కష్టపడి అర్ధంచేసుకో దగ్గ ఆణి ముత్యాలు. 'వెన్నెల కెరటాలు' కాంతులు విరజిమ్ముతాయి. ముఖచిత్ర వివరణలో కూడా ప్రత్యేకత సంత రించుకుంది.

—అమ్మాజీ సర్కార్
అల్ హసా

# వెన్నెల కెరటాలు

## సచ్చిదానందరాయ్

ఆధునిక ఒడియా కవిలోకమూర్ధ్న్యుడైన సచ్చిదానందరాయ్ చౌదరికి 1986 సంవత్సరానికి గాను జ్ఞానపీఠ్ అవార్డు లభించింది. జ్ఞానపీఠ్ అవార్డు నందుకున్న ఒరియా సాహిత్య నిర్మాతలలో సచ్చిదానందరాయ్ చౌదరి రెండవవారు. ఇదివరకు శ్రీ గోపీనాథ్ మహంత్ అను వారు, మరొకరితో కలిసి ఆ బహుమతిని పంచుకున్నారు. 1939 లో రచించిన 'బాజీరావుత్' అనే దీర్ఘ కవిత ఆయనకు మిక్కిలి ఖ్యాతితెచ్చిపెట్టింది. ఈ కవితలో ఒక పన్నెండేండ్ల నావ నడిపే బాలుడు బ్రిటిష్ పాలకుల నెదిరించి పోలీసుల తుపాకిగుండ్ల కెరయై నేలకొరగిన వీరగాథ వర్ణితమయింది. ఈయన 18 కవితాసంకలనాలు, ఒక కావ్య నాటకం, నాలుగు కథానికా సంగ్రహాలు, ఒక నవల, మూడు సాహిత్య విమర్శ గ్రంథాలు సాహిత్యపు విలువలను సంస్థాపించే ఒక అమూల్యమైన పరిశోధన గ్రంథాన్ని వెలువరించారు. 1962లో ఆయనను భారతప్రభుత్వం 'పద్మశ్రీ' బిరుదుతో సత్కరించింది.

—సంపాదకీయం
'స్రవంతి'

## జలాంతర్గాములు

క్రీ.పూ. 4 వ శతాబ్దంలోనే అలల అడుగున మనుషుల్ని సాగనంపగల్గినట్లు అరిస్టోటిల్ రాశాడు. ఆ దరిమిలా ఎన్నో ప్రయత్నాలు కొన్ని విజయవంతంగా జరిగితే, మరి కొన్ని విఫలమైనాయి. అమెరికా స్వాతంత్ర్య యుద్ధ కాలంలో సింగిల్ ఆపరేటర్‌తో నీటి అడుగున నడిచే 'టర్టిల్' వచ్చింది. మొదటి ప్రపంచ యుద్ధంలో (1914-19) జర్మన్లు, తను నౌకలు 183 పోగొట్టుకొన్నా, 5,408 వాణిజ్య నౌకల్ని, 13 జలాంతర్గాములు సహా 94 యుద్ధనౌకల్ని ముంచారు. రెండో ప్రపంచ యుద్ధంలోనూ జర్మన్లు తమవి 784 కోల్పోయి, 2,828 వాణిజ్య నౌకల్ని, 3 జలాంతర్గాములు సహా మొత్తం 175 యుద్ధ నౌకల్ని ధ్వంసం చేశారు. అలల అడుగున కనబడకుండా వుండగలగటమే జలాంతర్గాములు విజయవంతం కావడానికి దారి తీసింది.

—వ్యాసభాగం
'సైనిక సమాచార్'



# పాతికేళ్ళ నాటి పిక్చర్

## మోడరన్ థియేటర్స్ 'మొనగాడు'

ఇది ఒక క్రయిమ్ థ్రిల్లర్ – క్రయిమ్ థ్రిల్లర్‌కి వుండే లక్షణాలన్నీ యిందులో ఉన్నాయి. సాహస కృత్యాలతో బాటు ప్రేమరసవాహిని కూడా ఉంది. రమేష్ (హరనాథ్) అనే ఇంజనీరుకి, తాడు బొంగరం లేని సామాన్యమైన ఇంజనీరుకి, అవలీలగా లక్షలు సంపాదించాలనే దురాశ పట్టుకుంటుంది. ఆ ఆశాపిశాచం నుంచి తప్పించుకోలేక, ఎండమావులైన లక్షల కోసం, ఒక కత్తుల బోనులో యిరుక్కుంటాడు. అందులో ప్రవేశించడమే గాని బయటపడటమనేది వుండదు. అది ఒక సాలెగూడు – అండర్ వరల్డ్. భుజంగమూ (ప్రభాకర రెడ్డి), ప్రకాష్ (బాలయ్య) ఆ అండర్ వరల్డ్‌కి అధిపతులు. అందరికంటె భయంకరంగా కనిపిస్తూ, అందరినీ బెదిరించే వ్యక్తి కత్తుల రత్తయ్య (యస్వీ రంగారావు). 'మూడు ఆసుల' మందిరంలో, మొదటిసారిగా రమేష్‌ని చూసిన గీత (కృష్ణ కుమారి), ఆ అమాయకుని ఎలాగైనా ఈ ఊబిలో నుంచి బయట పడేయాలని బద్ధకంకణం కట్టుకుంటుంది. గీత ఒక కోటీశ్వరుని ఏకైక కుమార్తె. లోకవృత్తం తెలియని రమేష్, యిందులో నిష్కారణంగా యిరుక్కుపోయాడనీ, యిటువంటి మంచి వానిని కాపాడి తన జీవితం ధన్యం చేసుకోవాలనీ, అందుకుగాను ఎత్తు పై ఎత్తులు ప్రారంభిస్తుంది. తేలికగా లక్షలు సంపాదించాలనే తప్ప, యితర మెరుగని రమేష్, ఈ మహానాటకంలో ఒక పావు. గీత అతనిని కంటికి రెప్పలా కాపాడటానికి పూనుకుంటుంది; అతని ప్రేమను కంఠహారంలా ధరిస్తుంది. అయితే, కత్తుల రత్తయ్య, భుజంగం, ప్రకాష్‌ల మధ్య అంతా గందరగోళంగా ఉంటుంది. భయంకరాకారుడు కత్తుల రత్తయ్య 'నేనెవరో తెలుసా?' అని ప్రశ్నించడంతో కథ పూర్తవుతుంది. అతను నిజానికి విలన్ కాదు – పోలీసు అధికారి. గీతారమేష్‌ల ప్రేమ ఫలించి దుష్టులు శిక్షకు లోనవుతారు .... యస్వీ రంగారావు నటన ప్రేక్షులని ఆశ్చర్యచకితులు గావిస్తుంది. ప్రభాకరరెడ్డి, బాలయ్య తమ పాత్రలకు యథోచితన్యాయం చేశారు. కృష్ణకుమారి సాహసమూ శృంగారమూ సమపాళ్ళంలో చూపగలిగింది. చక్కటి టెంపోతో, బిగి చెడకుండా, స్క్రీన్‌ప్లే తీర్చిదిద్దారు దర్శకులు యస్‌డి లాల్.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' – జులై 1966



# మానవ ప్రగతి

## ప్లాస్టిక్ భవనాలు

అత్యధిక నాణ్యత గల ప్లాస్టిక్‌తో నిర్మించిన మొట్టమొదటి గృహానికి ఇటీవల అమెరికాలోని పిట్స్‌ఫీల్డ్ (మశాచుసెట్స్) లో ప్రారంభోత్సవం జరిగింది. ఈ ప్లాస్టిక్ గృహం భవిష్యత్తులో గృహ నిర్మాణ రంగంలో ఎంతో ఆసక్తికరమైన మార్పుకు దోహదం చేస్తుందని భావిస్తున్నారు. నలుగురు వ్యక్తులు గల ఒక కుటుంబం కోసం 280 చదరపు మీటర్ల విస్తీర్ణంలో నిర్మితమైన ఈ రెండంతస్థుల 'ప్లాస్టిక్ భవన' నిర్మాణానికి — పరిశోధన, అభివృద్ధి వ్యయంతో సహా మొత్తం ఒక కోటి డాలర్లు ఖర్చయింది. ఈ భవనంలో అటు ఇటు జరుపుకొనడానికి అనువైన గోడలు కూడా వున్నాయి. ఈ భవన నిర్మాణానికి వినియోగించిన 'ఇంజినీరింగ్ ప్లాస్టిక్ సామాగ్రి' కి గత నలభయ్యేళ్లలో బొమ్మలు చెయ్యడానికి లేదా ప్లాస్టిక్ ఇళ్ల నిర్మాణానికి వినియోగించిన ప్లాస్టిక్ వస్తువులకు పోలిక ఏ మాత్రం లేదు. 'పిట్స్‌ఫీల్డ్' గృహంలో వినియోగించిన ప్లాస్టిక్ పదార్థాలు అత్యధిక ఉష్ణోగ్రత వద్ద మాత్రమే కరుగుతాయి. ఈ పదార్థాలు నప్పుడు అతి తక్కువ పొగ మాత్రమే వస్తుంది. వీటికి ధ్వనిని తగ్గించే లక్షణాలు కూడా ఎక్కువగా వున్నాయి.

## ఆదిమ తెగలు

దేశంలోని ప్రతి ప్రాంతం అధిక జనాభా సమస్యతో సతమతం అవుతూంటే అండమాన్ దీవులలో విచిత్రమైన పరిస్థితి కన్పిస్తున్నది. అండమాన్ దీవులలో ఆది నుంచీ ఉంటున్న గిరిజన తెగల జనాభా పెరగడం లేదు. సరికదా క్రమంగా క్షీణిస్తూ అసలు ఆతెగలు అంతరించిపోయే ప్రమాదం ఏర్పడింది. 1981 జనాభా లెక్కలు ప్రకారం అండమాన్ దీవుల జనాభా మొత్తం రెండు లక్షలు కాగా అందులో మూడవవంతు మంది గిరిజనులే. బంగాళాఖాతంలో ఉన్న ఈ ద్వీప సమందాయంలోని గిరిజనులు నీగ్రో సంతతికి చెందిన నాలుగు తెగలుగా

ఉన్నారు. గ్రేట్ అండమానీస్, అంగీలు, జెరావా, నెరిటివెలీసి అన్నది ఈ తెగలపేర్లు. ఇక మంగోలీస్ సంత తికి చెందిన నికోబరీస్, షోంవెస్ తెగలవారు కూడా ఈ ద్వీప సము దాయంలో కానవస్తారు. ఈ దీవుల లోని నీగ్రోసంతతివారంతా ఒకో జాతికి చెందినవారయినా, భాష, వారు వాడుకచేసే పనిముట్లు ఆధా రంగా వారిని రెండు ప్రధాన వర్గా లుగా విభజించవచ్చు. మొదటి వర్గం క్రిందకు గ్రేట్ అండమానీస్ తెగవారు, రెండవవర్గం కిందకు అంగీలు, జర వాలు, నెంటినెరీన్ తెగలవారు వస్తారు. ఈ నీగ్రో సంతతి తెగలవారి సంఖ్య, మంగోలియన్ సంతతికి చెందిన షోంవేన్ తెగవారి జన సంఖ్య క్రమంగా క్షీణిస్తోంది. వీరిలో మొదటి తెగ వారి జనాభా 28 కాగా రెండవ తెగవారిజనాభా 250 మాత్రమే ఉంది.

## 'చలువ అద్దాలు'

న్యూయార్కు చెందిన ఒక కంపెనీ తయారుచేసిన ఒక విలక్షణమైన 'సన్ గ్లాస్' (చలువ అద్దాలు) విద్యుత్ ప్రేరణతో పని చేస్తుంది. దీని వల్ల సూర్యరశ్మి కారణంగా కంటికి జరిగే నష్టాన్ని మరింత ఎక్కువగా నివారించ డానికి వీలు కలుగుతుంది. ఈ క్రొత్త రకం 'చలువ అద్దాలు' కేవలం కొద్ది సెకన్ల వ్యవధిలోనే తను ద్వారా ప్రసరించే కాంతిని 44 శాతం నుంచి 88 శాతం వరకు 'వడ పోస్తాయి'. 'రిసెర్చి ఫ్రాంటియర్స్ ఇన్‌కార్పొరే టెడ్' అనే సంస్థ తయారు చేసిన ఈ చలువ అద్దాలలో కాంతిని 'పీల్చుకునే' సూక్ష్మకణాలతో కూడుకొని వున్న ద్రవం వుంటుంది. విద్యుత్ ప్రేరణ జరిగినప్పుడు ఈ సూక్ష్మకణాలు అద్దాలు ద్వారా హెచ్చు, లేదా స్వల్ప కాంతిని అనుమతించే విధంగా 'పేర్చి' వుంటాయి. ఈ 'సన్ గ్లాస్' కి అవసర మైన విద్యుత్‌ని 'ఫ్రేము' లోపల అమర్చి వుండే ఒక చిన్న 'బ్యాటరీ' సమకూర్చుతుంది. దీనిని అదుపు చెయ్య డానికి చిన్న మీట కూడా వుంటుంది. గది కిటికీలకు కూడా ఈ క్రొత్తరకం చలువ అద్దాలను ఉపయోగించే విష యం పరిశోధకుల పరిశీలనలో వుంది.



అనువుగాని చోట సాహసం అర్ధ రహితం.

ఇచ్చి పుచ్చుకోవడాలు లేకుండా సంఘజీవిత మనేది ఉండదు.

సంభాషణ అనగా ఎదుటవారిని ప్రశ్నలు వేయడం కాదు.

మట్టిబుర్రలుతప్ప మిగతా ఎవరూ డబ్బు లేకుండా రాయరు.

సంఘ విద్రోహి చిట్ట చివర ధరించే ముసుగు ప్రజాసేవ.

ఇతరులకి బాధ కలిగించే బదులు మనం బాధపడటం మంచిది.

ప్రేమ అనగా వెర్రి బాగుల వాని లోని వివేకం, వివేకవంతునిలోని వెర్రి బాగులతనం.

—శామ్యుల్ జాన్సన్



# కొత్త పుస్తకాలు

స్పందన - 'శ్రీ జిడ్డు కృష్ణమూర్తి జీవితం : తత్త్వం' - సమర్పణ ; కెకె రామానుజాచార్యులు..... ప్రచురణ : ప్రాప్తి బుక్స్, పిబి 5018, బెసంట్ నగర్, మద్రాసు - 600 090. వెల : రు 30-00.

అభిమానులకు 'జె.కె.', మిత్రులకు 'కె', అందరికీ కృష్ణాజీ అయిన జిడ్డు కృష్ణమూర్తి, జగద్రక్షకుడా, ప్రవక్తా, వేదాంతియా, తాత్వికుడా, కవియా, తార్కికుడా, సౌందర్యోపాసకుడా? ఇవేమీ కాదు, పథికులకు దారి తెలిపే జ్ఞాన సంపన్నుడు. నేటి ప్రపంచంలోని ఉన్మాదాన్ని, ఆందోళనని నివారించ గలిగేది స్వార్థ త్యాగజనితమగు 'ప్రేమ' ఒక్కటేననీ, అది స్పందన నుంచే సంభవనీయమనీ మానవాళికి గుర్తు చేసిన మహోన్నతమూర్తి.

రష్యా దేశస్తురాలైన బ్లవట్స్కి, అమెరికా దేశస్థుడైన ఆల్కాట్ 1875 లో, జాతి, మత, కుల, వర్ణవివక్షత లేని, వివిధానేక మత విశ్వాసాలకు అతీతమైన, దివ్యజ్ఞాన సమాజాన్ని, న్యూయార్క్ నగరంలో స్థాపించారు. 1879 లో దాని కార్యాలయం బొంబయికి వచ్చింది; 1882 లో మద్రాసులోని అడయార్‌కి. 1907 లో అనిబిసెంట్ ఈ దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షురాలయారు.

త్రివిష్టప (టిబెట్) వాసులైన మోర్యా, కూత్ హూమిలు దివ్యజ్ఞాన సమాజం వారికి పరమ గురువులు. వెనుక కృష్ణునిగా, ఏసుక్రీస్తుగా జన్మించిన మైత్రేయుడు తిరిగీ రానున్నాడనే పరమ గురువుల వాక్యం ఈ సామాజికులకు శిరోధార్యమయింది.

మదనపల్లిలోని నారాయణయ్య సంజీవమ్మలకు, ఆ వెలనాటి వైదిక బ్రాహ్మణ దంపతులకు, పదకొండు గురు సంతానంలో అష్టమ గర్భంగా జన్మించాడు కృష్ణమూర్తి 1895 లో, భార్య పోయాక నలుగురు పిల్లలతో - శివరాం (15) కృష్ణమూర్తి (12) నిత్యానంద (9) సదానంద (5) - మద్రాసు చేరిన నారాయణయ్యను అనిబిసెంట్ ఆదరించింది. మైలాపూర్ పియస్ హైస్కూలులో చదువుకొనే రోజులలో కృష్ణమూర్తి ఎప్పుడూ మంద కొడిగా ఉంటూ బెత్తం దెబ్బలు తినేవాడట, గోడ కుర్చీలు వేసేవాడట. అనిబెసెంట్ విదేశ పర్యటనలో ఉన్నప్పుడు, లెడ్‌బీటర్ దివ్య జ్ఞాన సమాజ వ్యవహారాలు చూస్తూండేవాడు. ఇరువురూ సమవయస్కులు.

మైత్రేయుడు ఎక్కడ వుంటాడా అనే అన్వేషణ అప్పటికే ప్రారంభ మయింది. న్యూయార్క్‌కి చెందిన పద మూడేళ్ల హ్యూబర్ట్‌ని యోగ్యునిగా భావించారు మొదట్లో! ఆ తర్వాత కృష్ణమూర్తి అనుకూలునిగా తోచాడు లెడ్‌బీటరకి. కృష్ణమూర్తిని, అతని సోదరుడు నిత్యానందని చేరదీసి, యిరువురికీ ప్రత్యేక విద్య, ప్రత్యేక శిక్షణ, ప్రత్యేక స్థానము కల్పించారు. తండ్రినీ మిగతా సోదరులని, కలుసు కోవడమనే ప్రసక్తి లేకుండా తగుకట్టు దిట్టంతో సోదరు లిద్దరిని చట్టపరంగా దత్తత చేసుకొంది అనిబెసెంట్. తర వాత్తరవాత నారాయణయ్యకు ఆమెకీ వచ్చిన తగాదాల్లో ఈ దత్తత చెల్లదని మద్రాసు హైకోర్టు అన్నప్పటికీ, ప్రీవీ కౌన్సిల్ ఆమె పక్షంగానే తీర్పు ఇచ్చింది.

1910 జనవరి 10 వ తేదీ సాయంత్రం నుంచి 12 వ తేదీ ఉద యం దాకా 'మైత్రేయక్రతువు' జరి గింది. దైవజ్ఞులు నిర్ణయించిన శుభ ముహూర్తంలో పరమ గురువులు తనని మైత్రేయుని ఆశ్రమానికి నడిపిం చుకు వెళ్లినట్లూ, ఆ మైత్రేయుని శిరసు పైవున్న నక్షత్రం ధవళ కాంతులు వెదజల్లినట్లూ అనుభూతి కలిగిందట కృష్ణాజీకి.

అక్కడితో కృష్ణమూర్తిని 'జగ ద్గురువు'ని చేశారు దివ్యజ్ఞాన సమాజం వారు. ఈ నైష్ఠికకర్మ జరిగిన సంవ త్సరానికి వారణాసిలో, జార్జి అరం డేల్, కృష్ణాజీని 'స్టార్ ఆఫ్ ది ఈస్ట్' అన్నాడు - జగద్గురువు పేరు మీద 'ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ఆఫ్ ది ఈస్ట్' అవతరించింది. ఆ సంస్థ పీఠాధిపతి కృష్ణాజీ. అనిబిసెంట్, లెడ్‌బీటర్, జార్జి అరండేల్ వంటి ప్రముఖులు కార్యవర్గ సభ్యులు .... 'జగద్గురువు' కృష్ణాజీ, తన సోదరుడు నిత్యానందతో బర్మా, ఇంగ్లాండ్, అమెరికా, ఫ్రాన్స్, ఆస్ట్రేలియా మొదలైన దేశాలు పర్య టించి, దివ్యజ్ఞాన సమాజ సభ్యులనే గాక, యితర రంగాలలో వారిని కూడా కలుసుకున్నాడు. విశాల ప్రపంచం చూస్తున్నకొద్దీ, అతనితో అంతరంగ మథనం ప్రారంభమయింది. కృష్ణాజీ చేసే ప్రసంగాలలోని మార్పుగ్రహించిన లెడ్‌బీటర్, 'జగద్గురు' స్థానానికి మరి కొందరిని వెతికి, అందులో రాజగోపా ల్‌ని ఎన్నికచేసి, పైచదువుకని లండన్ పంపించగా, అక్కడ కృష్ణమూర్తి, ఈ రాజగోపాల్ అతిసన్నిహితులూ ఆత్మ బంధువులూ అవుతారు. 1914 లో లెడ్‌బీటర్ ఆస్ట్రేలియా వెళ్లిపోయాడు. 1925 నవంబరులో నిత్యానంద మరణించాడు. 1929 ఆగస్టు 3వ తేదీన మూడువేల మంది సభ్యుల సమ క్షంలో 'ఆర్డర్ ఆఫ్ ది స్టార్' సంస్థని రద్దుచేస్తూ, ఆయాదాతల ఆస్తులు వారి కిచ్చివేసి, తను జగద్గురువుని కానని, కేవలం సత్యాన్వేషిననీ బాహాటంగా ప్రకటిస్తాడు కృష్ణాజీ. అదే ఆయనలోని గొప్పతనం - ఆ సాహసచర్యే ఆయనని యుగపురుషునిగా, చేసింది. జవహర్ లాల్ నెహ్రూ, ఆల్డస్‌హక్స్‌లే వంటి మహనీయులు ఆయనని సలహా అడిగే

వారంటే, కృష్ణాజీ ఎటువంటి మహోన్నత పీఠం అధిరోహించారో తెలుసుకోవచ్చు. ఇరవై సంవత్సరాలుగా తన చుట్టూ కట్టిన మణిమయకాంతుల బంగారు సౌధాన్ని ఛేదించి, జగద్గురువుగా పూజలందుకున్న పీఠాన్ని పక్కకినెట్టి, జనార్ణవంలోకి వచ్చి, ఈ శతాబ్ది ప్రజను సృజనాత్మక చైతన్యం వైపుగా కళ్లుతెరవమని ప్రబోధించిన కృష్ణాజీ మహాజ్ఞాని, ఆధునిక రుషి .... 1933 సెప్టెంబరులో అనిబిసెంట్ పోయారు; ఆరునెలలలో లెడ్‌బీటర్ దివంగతుడయాడు. ఆర్డర్ ఆఫ్ ది స్టార్ రద్దుచేసిన నాలుగునెలలకి కృష్ణాజీ, థియొసాఫికల్ సొసైటీతో (దివ్యజ్ఞాన సమాజం) తెగతెంపులు చేసుకున్నారు.

ఇంత అందమైన మనిషిని నేను చూడలేదు - అన్నాడు బెర్నార్డ్‌షా. రాజకీయాలకు దూరంగా వుంటూనే గాంధీజీతో ఎంతో కలుపుగోలుగా వుండేవారు. 'దేవుడులేని దేవాలయంలోఎవరు ప్రవేశిస్తే ఏమున్నది ?' అని కృష్ణాజీ ఏనాడో హెచ్చరించారు. 1928 నుంచి రుషీవలీలో ఒక స్కూలు (300 ఎకరాలు); 1934 నుంచి వారణాసికి అయిదుమైళ్ల దూరానున్న రాజఘాట్‌లో ఒకస్కూలు (200 ఎకరాలు); 1968 నుంచి హాంప్‌షైర్‌లో (ఇంగ్లాండు) ఒకటి; 1975 నుంచి ఓహైలో ఒకటి, బొంబయిలో ఒకటి యిలా ప్రపంచ వ్యాప్తంగా విద్యాకేంద్రాలు ఏర్పరిచారు - స్వబుద్ధితో సత్యాన్వేషణ గావించమనే కృష్ణమూర్తి. తన 91వ ఏట 1986 ఫిబ్రవరి పదహారు అర్ధరాత్రి గాఢనిద్రలో కడపటి శ్వాస వొదిలేదాకా, చుట్టూ వారిని తన జ్ఞానజ్యోతితో ప్రభావితులుగావిస్తూనే వున్నారు.

'శరీరానికి స్నానం వంటిది మనసుకి ధ్యానం, ధ్యానం అంటే ప్రార్థన కాదు - ఆత్మజ్ఞానాన్ని యిచ్చేది. అందుకు ముఖ్యంగా కావలసింది ప్రేమ. ప్రేమ ఉన్నచోట భయం ఉండదు.... యోగం అనగా ఒక జీవన విధానం.... అన్వేషణ మానవుని సహజ లక్షణం. జీవితానికి అర్థం జీవించడమే గాని అందులో ఏ పరమార్థమూ లేదు.... సృష్టి, సృజన జీవలక్షణాలు సృజనాత్మక జీవనమంటే స్వార్థాన్ని అధిగమించి చూడగగలటం' - ఇలా చెబుతారు కృష్ణమూర్తి.

కెకె రామానుజాచార్యులు, జిడ్డు కృష్ణమూర్తి జీవితాన్ని ఒక తైలవర్ణ చిత్రంలా మనముందు వుంచారు. ఫొటోగ్రాఫర్ ఏనాడూ చూపలేని అందాలను చిత్రకారుడు తన రేఖలూ రంగులూ ద్వారా సృజనాత్మక లక్షణంతో మన కళ్లకగుపింప చేస్తాడు. అదే చేశారు రచయిత రామానుజాచార్యులు. చక్కటి తెలుగులో మనసుకి హత్తుకొనే రీతిని, కృష్ణాజీ జీవితమూ ఫిలాసఫీ చెబుతూ! బాపు భావస్ఫోరక ముఖచిత్రం గల ఈ పుస్తకం, ఈ శతాబ్దపు మహాజ్ఞాని గురించి తెలుసుకోదలుచుకున్న వారికొక కరదీపిక.

—క్షీరసాగరమ్

### ఈ మధ్య అందినవి :

ఔచిత్య ప్రస్థానము - సూరన కవిత్వము.... ఉపాధ్యాయుల అప్పల నరసింహమూర్తి.... రసజ్ఞ ప్రచురణ, విజయనగరం.... రు 50-00.

అరవై వసంతాలు - శార్వరి.. మాస్టరు యోగాస్కూల్, హైదరాబాద్ 380.... రు 30-00.

యోగి వేమన (ఆంగ్లంలో 101 పద్యాలు, - శ్రీనివాసులు.... పద్మావతి పబ్లిషింగ్, మద్రాసు - 17........ రు 4-00.

మన పిల్లలకు ఎలాంటి ప్రపంచం సంక్రమిస్తుంది - వాని చెస్లావ్ కతమిద్జె .... సోవియట్ నాడు ఆఫీసు, మద్రాసు 17.

స్మృతిగీత - సి. వేదవతి ....... స్పందన సాహితీ సమాఖ్య, మచిలీపట్నం - 1.... రు 20-00.

స్త్రీ సేవా మందిర్ - 40 వ వార్షిక సంచిక మిసెస్ - ఎసి కృష్ణారావు - స్త్రీ సేవా మందిర్ ప్రెస్, మద్రాసు - 93.

బాపూ రమణీయం.... నవోదయ పబ్లిషర్స్, విజయవాడ - 2. సాధా ప్రతి రు 60-00.... లైబ్రరీ ప్రతి రు 85-00.

గులాబి - కవిత....డి. సుబ్రహ్మణ్య శాస్త్రి, ఆర్. సుబ్బలక్ష్మి.... శ్రీ కళా భారతి, బొబ్బిలి.... రు. 5-00.

మనసు గారడి - మనోవైజ్ఞానిక రచనలు ... డా॥ వాసిరెడ్డి సీతాదేవి .... వికాసం, హైదరాబాదు - 28 రు. 25-00.

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కె యన్ కేసరి



కేసరిగారి జీవితం ఆదర్శ ప్రాయమైనది. 'డబ్బు తేలేనట్టి నరులకు కీర్తి సంపదలబ్బవోయ్'- అన్నారు గురజాడ. బాల్యంలో పడ్డ కష్టాలు అధిగమించి, జీవితంలో స్థిరపడి, స్థితిమంతుడై, సంపదలతో బ్రతుకు బాటను ఆనాటికానాడు విస్తృత పరుచుకుంటూ, లలితకళాభిరుచితో బాటు, సేవాధర్మంలోనే సార్థక్యం ఉందని గ్రహించి, ఆ సూత్రాన్ని జీవితంలో అమలుపరిచిన మహానుభావుడాయన. ఎందరో చిత్ర కళాకారులని వెలుగులోకి తెచ్చింది 'గృహలక్ష్మి' - ఎందరో నిర్భాగ్య వనితలకు ఆశ్రయమిచ్చింది కేసరీ కుటీరమ్.... మద్రాసు పౌర జీవితంలో చెరగని ముద్ర వేసిన ఈ మహా పురుషుని 'చిన్ననాటి ముచ్చట్లు' 1989 జూలై సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాము.

సత్యవతియు, కుంతియు - అవివాహితులుగనే సంతానవతులయ్యు - పిదప ఉత్తమ రాజపత్నులు, రాజమాతలునై వర్ధిల్లిరి. సీతను, అపవాద పరితప్తను, భర్తచే అడవిలో విసర్జింపబడినదానిని, వాల్మీకి ఆదరించి, స్వయముపోసి, శిశువులను తల్లిని పోషించి తిరిగి వారిని రాముని సన్నిధానము నకు చేర్చియున్నాడు.

"అహల్యా ద్రౌపతీ సీతా తారా మండోదరీ తధా
పంచ కన్యాస్మరేన్నిత్యం మహాపాతకనాశనం"

అన్న పురాణ శ్లోకము చాల గంభీరార్ధము కలది.

ఇకనిట్లు భ్రమప్రమాదములవల్ల తత్కాలమున అపచారమొనర్చినవారి సంతానమును ఆదణీయము. అట్టి ఆదరణయును ఉత్కృష్టమగు మానవసేవయే నాగటిచాలున కల్పించిన బాలికను స్వంతకుమార్తెగా పెంచి పెద్దచేసి శివ ధనుస్సు విరిచిన శ్రీరామచంద్రమూర్తికిచ్చి వివాహమొనర్చిన కర్మయోగి జనక మహారాజు. కర్ణుని పెంచి పెద్దజేసిన రాధయు సూతుడును మానవసేవాపరా యణులే. శకుంతలను సాకిన కణ్వుని దయార్ద్రహృదయము కాళిదాసు వేయి విధముల వర్ణించియున్నాడు. వీరందరట్లాదరింబడక పోయినచో ఏమై యుందురోకదా ! ఇట్లింకెందరో పురాణములలో చరిత్రలలో కలరు.

## పతిత - క్రీస్తు

పతితపావనత్వమునుగూర్చి బైబిలునందు ఈ విధముగ నొక కథ జోహన్ సువార్తలో చెప్పబడియున్నది. (8 వ అధ్యాయము) :

క్రీస్తు ధర్మబోధనలచేయుచు పల్లెలు పట్నములు తిరుగుచుండగా యూదులు తమ పూర్వసాంప్రదాయముల యందు పట్టుదల వల్లను, ఆయన నూతనప్రేమ సందేశము నవలంబింపదగు సంస్కారములేనందువల్లను - ఆయ నను ద్వేషించి వేధింపదలచుచుండిరి. ఒకనాడు ప్రాతఃకాలమున ఆయన సమీపస్థమగు కొండలనుండి యొక పట్నమునకు రాగానే కొందరు యూదులు ఆయన కడకొక యౌవనవతిని కొనివచ్చిరి. "స్వామీ, ఈమె వ్యభిచరించు చుండగా పట్టుకొని వచ్చితిమి. పూర్వము మోసెస్‌యోగి ఇట్టివారిని రాళ్లతో కొట్టి శిక్షింపుడు అని స్మృతి వ్రాసియున్నాడు. తామేమి శెలవిచ్చెదరు ?" అని అడిగిరి. ఆయన ఏమియు పలుకక నేలపై నేదియో వ్రాయుచుండెనట. ఆమె విషయమై ఆయన మెత్తపడుచున్నాడు ; ఈ సాకున నీయనపై నింద మోప

వచ్చుననివారు ఉత్సాహవంతులై - గ్రుచ్చిగుచ్చి అడుగసాగిరి. అప్పుడాయన తలయెత్తిచూచి -

"మీలో ఎవరైతే ఎప్పుడున్నూ వ్యభిచరించియుండలేదో అతడీమెపై మొదట రాయి విసరును గాక" అని చెప్పి తిరిగీ తలవంచి వ్రాయసాగెను.

క్రీస్తు మరికొంతసేపటికి తలఎత్తి చూడగా, అక్కడ తానును ఆ యువతియు తప్ప మరెవ్వరులేరు. అంత క్రీస్తుదేవుడు కరుణారసముప్పొంగ "ఎవ్వరును నిన్ను శిక్షింపలేదా ?" అని అడిగెను. "లేదు" అని ఆమె చెప్పగనే "అయితే నేనును శిక్షింపనులే పో; ఇకపై నిట్లు వ్యభిచరించకు" అని సానునయ వాక్యముల చెప్పి పంపినాడు.

మానవసేవయే మాధవసేవ యను వాడుకవచనమున్నదిగాని నా అనుభవములో అది అంత సులభమైన కార్యముగాదు. అనాధ స్త్రీలను ఉద్ధరించుటకు కంకణము కట్టుకున్న పుణ్యపురుషులు అపనిందలకు లోనుగాక తప్పించుకొనుట చాల కష్టము. దయార్ద్ర హృదయులై పరిశుద్ధాత్మతో అనాధ స్త్రీలను చేరదీసిన రావుబహదూరు వీరేశలింగం పంతులుగారు కూడా ఈ దెబ్బ తప్పించుకో జాలరైరి. ఇక సామాన్యుల సంగతి చెప్పవలయునా ?

ఈ స్త్రీ జనోద్ధరణ కార్యక్రమమున నిరంతరము స్త్రీల సాహచర్యము మానవసేవా పరాయణులకు తప్పని సరియగును. అందును సంఘబహిష్కారము పొందినవారును, సంఘముచే దూషింపబడువారును కూడ తటస్థించుట కవకాశమున్నది.

పోతన భాగవతమున ఈ క్రింది పద్యము చెప్పబడియున్నది :

పొలతి దాపవహ్ని ; పురుషు డాజ్యఘటంబు ; కరుగ కుండరాదు కరిగెనేనే
బ్రహ్మయైన కూతు బట్టగ జూచును వడుగు కింతి పొత్తు వలదు వలదు.

సుమతి శతకమున మరొక పద్యమున్నది :

"పరపతి సంగతి నుండిన పురుషుడు గాంగేయుడైన భువి నింద పడున్,
పరపతి సుశీలయైనను పరుసంగతిచేత నిందపాలగు సుమతీ"

ఈ రెండును పైన పేర్కొన్న భ్రమ ప్రమాదములు.

ఇట్టి ప్రమాదమునుండి తప్పించ గలుగుటకు అనుకూలవతియగు భార్య చాలవరకు రక్షణ కాగలదు. అనుకూలవతి యనగా కేవలము పతివ్రత పరాయణయే కాదు భర్త ఉద్దేశములను ఆదర్శములను ఉదారబుద్ధితో అర్థముచేసుకొని ఆయనకు ఆ కార్యక్రమమున చేదోడు వాదోడుగా నుండగల ఆమె అని నా అర్థము. ఇట్టి సంస్థలు స్త్రీ పురుషులు కలసి కృషిచేయుచో

సంసారము వలెనే సక్రమముగా నడువగలవు. ఇందులకు ఉదాహరణముగా నాకు తెలిసిన కొన్ని మానవసేవా సంస్థల విషయమై వివరించి, పిదప నా అనుభవములను కొన్నింటి తెల్పెదను.

## గుంటూరు, శారదా నికేతనము

ఈ సంస్థకు తల్లిదండ్రులు ఉన్నవ లక్ష్మీబాయమ్మగారును, వారిభర్త లక్ష్మీనారాయణగారున్నూ. వీరిరువు ఏక మనస్కులై పాటుబడుచున్నారు. ఆదిలో కందుకూరి వీరేశలింగము పంతులుగారితో కూడ పనిచేసి, పిమ్మట గుంటూరులోనే వితంతూ ద్వాహములు జరిపించినారు. వీరి చేతిమీదుగా గుంటూరులో 35 వితంతు వివాహములు జరిపి పుణ్యము గట్టుకొన్నారు. ఆ పిదప నొక బాలికాపాఠశాల నడుపుచు, తుదకు దానిని శ్రీ శారదానికేతనముగా స్థాపించి స్త్రీ విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నారు. నికేతనమును మంచి పునాదులపై నేర్పరచి అనేక అనాధబాలికలకు అన్నము పెట్టుచున్నారు. ఈ విద్యాలయము వీరి చేతిక్రింద దినదినాభివృద్ధి చెందుచున్నది. ఇంకను వెంద గలదు. దీనికి నాకుతోచిన ధనసహాయము ప్రారంభము నుండి చేయుచున్నాను.

## ఆంధ్ర మహిళా సభ

చెన్నపురి మహిళాసభను స్థాపించి సర్వశక్తులను సమకూర్చి పెంచి పెద్ద చేసిన శ్రీమతి దుర్గాబాయమ్మగారిని ఎల్లరును వేయినోళ్ల పొగడుచున్నారు. ఈ సంస్థకు తల్లియేగాని తండ్రిలేడు. అయితేనేమి ? వేయి తల్లిదండ్రులపెట్టు ఈ ఒక్క దుర్గాబాయమ్మగారు. ఆడుబిడ్డలకు ముఖ్యము తల్లియేకదా ? ఈ సభ ఇంతై, అంతై, ఇపుడొక బ్రహ్మాండమైనదై, దివ్యతేజముతో ప్రకాశించుచున్నది. ఇందు విద్య గరపుటయేగాక బ్రతుకుదెఱువు మార్గములను కూడ నేర్పుచున్నారు. ఇక్కడ ఆడుబిడ్డలకు వసతిగృహమున్నది. ఆటపాటల కనుకూలములున్నవి. బుద్ధిమంతురాండ్రగు గృహలక్ష్ములచేతనే ఈ సభ పరిపాలింపబడుచున్నది. అయితే ఇది అనాధశరణాలయం కాదు, ఇది ఉత్సాహవంతురాండ్రగు యువతులు విద్యాబుద్ధులు నేర్చి అంతశ్శక్తులను వ్యక్తపరచుటకు అవకాశమిచ్చునట్టి సంస్థ. ఈ సభకును ప్రాథమికావస్థయందు నా శక్తికొలది సహాయమొనర్చియున్నాను.

## హిందూ యువతి శరణాలయం

ఇది మరియొక స్త్రీ. చాలకాలముక్రిందట నెలకొల్పిన శరణాలయము. శ్రీమతి యామినీ పూర్ణతిలకమ్మగారు దేవదాసీబిడ్డలకు విద్యాబుద్ధులను గరపి వార్ల

వృత్తులనుండి తప్పించి వివాహములుచేసి, సంసారులగను మార్చుటకు కొందరు బిడ్డలను చేరదీసి, ఈ శరణాలయమును స్థాపించినారు. ఈ శరణాలయం మొదట తిరువళ్లిక్కేణిలో ఒక గల్లీలోనుండెను. ఒక దినము తిలకమ్మగారు నా వద్దకు వచ్చి వారి శరణాలయమును చూచుటకు నన్నుపిలిచెను. నేను మరునాడు అక్కడికెళ్లి చూచితిని. అప్పుడా శరణాలయము ఒక చిన్నయింటి యందుండెను. అప్పుడు నేను కీలుపాకులో యొకపెద్ద బంగళాతోటను అద్దెకు తీసుకొని ఈ శరణాలయమును అక్కడికి మార్పించితిని. నూలు వడకుటకు రాట్నములు, గుడ్డలు నేయుటకు మగ్గములు వగైరాలు సమకూర్చి తగుమైన సహాయము చేయుచుంటిని. అక్కడి పిల్లలకు చదువు, చేతిపని నేర్పుచుండిరి. అక్కడి పిల్లకాయలను కేసరికుటీరమునకు పిలుచుకొనివచ్చి తలనూనెలు, పళ్లపొడులు, వార్లచేత తయారుచేయించి, ఇంటింటికి తీసుకొనిపోయి విక్రయించు ఏర్పాటున్నూ చేయించితిని. వార్లకు తగుమైన ఉడుపుల కుట్టించి యిచ్చుచుంటిని. వారలు స్వతంత్రముగ జీవించుటకు తగుమైన చేతిపనులను నేర్పించుటకు ప్రయత్నించితిని. అయితే అక్కడి పిల్లలు పెద్దవారై వార్లయిండ్లు చేరుకొనిరి. శరణాలయమును మూయపడెను. తిలకమ్మగారి కుత్సాహము, దీక్షయునున్నను ఆమెకు సరియగు మగతోడు లేకపోవుట మొదటినుండి లోపమే. ప్రస్తుతమామె ఏదోయొక రూపమున తన ఉత్సాహము కొలది తాంబరములో యొక చిన్న పాఠశాల నడుపుచున్నట్లున్నది.

## సేవాసదనము

మద్రాసు సేవాసదనము స్థాపించినవారు శ్రీ ముత్తా వెంకటసుబ్బారావు గారును, వారిసతీమణి ఆండాళ్లమ్మగారును. ఈ సంస్థకు వారే తల్లిదండ్రులై యున్నారు. శ్రీ వెంకటసుబ్బారావుగారు మహోన్నత దశలోనుండి ఈ సేవాసదనము స్థాపించుటవల్ల ఇది గట్టి పునాదితో వర్ధిల్లుచున్నది. ఇందు చదివిన వారందరు కూడ మంచిబ్రతుకు తెరువును సంపాదించుకొని ఆ దంపతులను సదా స్మరించుకొనుచు జీవయాత్ర సలుపుకొనుచున్నారు.

## స్త్రీసదనము

మద్రాసు స్త్రీసదనమని యొకశరణాలయము కలదు. పడుపువృత్తి యందు జీవించు పడుచులను, భర్తలచే తరమగొట్టబడిన భార్యలను, అత్త పోరుపడలేక ఇల్లువెడలి పారిపోయి వచ్చిన పడుచులను, మరి ఇతర అనేక విధములగు అవస్థలు బాధలు పడలేక సంసారము త్యజించి పరుగెత్తి వీధిన

పడిన పడుచులను ఈ సదనమువారు చేరదీసి ఆదరించుచున్నారు. ఈ సదనమున విద్య, చేతిపనులు, మొదలైనవాటిని నేర్పి జీవించు మార్గములను చూపించుచున్నారు. తగుమైన వరుడు చిక్కిన వివాహమును చేయుచున్నారు. మరియు ప్రభుత్వమువారు పడుపువృత్తిచే జీవించువారిని శిక్షింతురు అట్టి వారి శిక్షానంతరము గౌరవముగా బ్రతుకుటకు బ్రతుకుదెరువు నేర్పి, క్రమశిక్షణ నిచ్చి కాపాడుటకు, ఈ సంస్థకు పంపుదురు. అప్పుడు వారికగు ఖర్చులు ప్రభుత్వము భరించును. ఈ విధముగ దీనికి ప్రభుత్వపు గ్రాంటులు వచ్చును. ఈ సంస్థలోని వారిని ఎంతో బందోబస్తుగా అనేక కట్టుదిట్టములతో కాపాడవలసిన వస్తున్నది.

## అవ్వ శరణాలయము

శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారును, ఈమె భర్త డాక్టరు రెడ్డి గారును చేరి ఈ శరణాలయము స్థాపించిరి. వీరిరువురు ఈ సంస్థకు తల్లి దండ్రులై పోషించుచుండిరి. ఇటీవల శ్రీ రెడ్డిగారు కాలగతి చెందిరి. శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డిగారు వ్యవహారానుభవముగల వారగుటచే దీనిని చక్కగా అభివృద్ధికి తెచ్చినారు. ఇటీవల స్కూలు బిల్డింగు కట్టించుటకై ప్రభుత్వము వల్ల రు. 39,500 లు గ్రాంటు సంపాదించిరి; ప్రజలవల్ల మరి 40,000లు సంపాదింప నుద్యుక్తురాలైయున్నది. ఆదిలో ఇది చిన్నసంస్థయే. ప్రస్తుతం అడయారులో కొన్ని పెద్ద భవనములను కలిగియున్నది.

పేదవారై దిక్కులేక కూడని సహవాసముల దుర్వృత్తులపాలైన స్త్రీలను శిశువులను చేరదీసి చదువుచెప్పి, మంచి వృత్తులవలబించు నేర్పరుల నొనర్చి, ఉద్ధరించుటయే ఈ సంస్థ ఉద్దేశము. ఈ సంస్థలో తయారైన స్త్రీలు ఉపాధ్యాయినులుగను, దాదులుగను, మంత్రసానులుగను తర్ఫీదునంది బ్రతుకుచున్నారు. 1948 సం॥ న ఈ సంస్థలోని కన్యలేడ్వురకు మంచి గౌరవ కుటుంబములకు చెందిన వరులు లభ్యమై వివాహములైనవని సగర్వముగ వార్షిక నివేదికయందు వ్రాయబడినది. ఈ శరణాలయమునకు కూడ నేను కొంత సహాయము చేసియున్నాను.

## గొల్లపిల్ల

నేను మంచిస్థితికి వచ్చినప్పుడు గుంటూరు శారదానికేతనము నుండి సంగం లక్ష్మీబాయమ్మ యనునామెను మద్రాసులో చిత్రకళాశాలయందు చదువుకొనుటకు నా వద్దకు పంపిరి. ఈమె మా యింటిలోనే భోజనము

చేయుచు మూడు సంవత్సరములు కళాశాలలో చదివి ఉత్తీర్ణురాలై, యిప్పుడు హైదరాబాదులో విద్యాలయమున పనిచేయుచు సుఖముగనున్నది. ఈమె ఖద్దరు వస్త్రములనే ధరించుచు. దేశసేవాభిమానురాలైయుండెను. గొల్లకుల మనిన కోపపడును. యాదవులని చెప్పవలయునని కోరుచుండును. అయితే నేను చనువుగ గొల్లపిల్ల అని పిలుచుచుంటిని. అప్పుడామె నవ్వుచుండెను. నా మొదటిభార్య ఒంగోలు ప్రాంతపు పల్లెటూరి యిల్లాలు, మేనమామ కుమార్తె. పూర్వాచారములను పట్టుదలగ పాటించు ఆచారవంతురాలు. ఈమెకు విద్య సున్న యగుటవలన ప్రపంచ విషయములకు చాలదూరముగ నుండెడిది. తులసిపూజ, పంచాక్షరి జపము కానిది గంగకూడ పుచ్చుకొనేది కాదు. కాఫీపలహారములెరుగదు. ఎప్పుడు పట్టుచీరతోనే కాలముగడుపు చుండెను. చేత తులసిమాల తిరుగుచునే యుండును. చాలపాతకాలపు భాగ్యశాలి. ద్వాదశిపారణకు బ్రాహ్మణుడు దొరకనినాడు నాకు ఔపోసనవేయు మనిన, ప్రొద్దుననే కాఫీ తీసుకొని, జాతివాడు పట్టిన సోడా త్రాగినవారికి, ఔపోసనవేసిన పుణ్యము లేదనును.

ఇటువంటి యిల్లాలి యింటిలో లక్ష్మిబాయమ్మ మూడుసంవత్సరములు కాలము యెట్లుగడిపినది పాఠకులు గ్రహించవచ్చును. ఈమెకు అన్నము పెట్టినపుడు దూరముగ గోడచాటున అకు వేసి వడ్డించమనేది. ఏకాదశినాడు పండ్లుఫలహారమును చేయునప్పుడు కూడా లక్ష్మిబాయమ్మ చూడకూడదు. తడికాళ్లతో యింటిలోకిరాకూడదు. ఇల్లంతయు శూద్రకూడయినదని విసుగు కొన చుండును. ఈ వైదికునియింట లక్ష్మిబాయమ్మ మూడు సంవత్సరములు కాలముగడుపుటకు ఆమె అనుసరణ తెలివితేటలే ముఖ్య కారణములు. ఈమెయే ఇటీవల శారదానికేతనం రజితోత్సవమున అధ్యక్షత వహించి యుండెను. ప్రస్తుతము యీామె హైదరాబాదు శాసనసభా సభ్యురాలు.

## కంసాలి పిల్ల

ఈపిల్ల సేవాసదనమున చదువుకొనుచు మాయింట నివసించుచుండెడిది. సేవాసదనమున కుట్టుపనిలో పరీక్షప్యాసుచేసి విద్యాలయములో యంబ్రాయి డరు టీచరుగ పనిచేయుచు జీవించుచున్నది.

## మంగలి పిల్ల

నేను తిరుచూరులో యున్నప్పుడు నాకు కృష్ణుడనే మంగలి క్షౌరముచేయు చుండెను. వాడికి జానకియను చెల్లెలుకలదు. అమె కొంతవరకు ఇంగ్లీషు

చదివియుండెను. ఈమెను మద్రాసుకు తీసుకొనిపోయి నర్సు పనిని నేర్పించ మని ఆ మంగలి నన్నుకోరెను. నేను దానికి సమ్మతించితిని. నేను మద్రాసుకు వచ్చునపుడు నాతో కూడ ఆమెను పిలుచుకవచ్చి నాయింటవుంచుకొని చదువు చెప్పించి గోషాఆసుపత్రిలో చేర్చి చదివించితిని. ఇక్కడ ట్రెయినింగు ముగిసిన పిమ్మట గుంటూరు గవర్నమెంటు హాస్పిటులకు పంపితిని. అక్కడామె యుండగ యొకడాక్టరును వివాహము చేసుకొని అరుగురు బిడ్డలతల్లిఅయి సుఖముగనున్నది. ఈమె మా యింట యున్నప్పుడుకూడ యింటిలోనిపోరు తప్పలేదు. మా ఆవిడ గొల్లకూడుపోయి మంగలికూడు వచ్చినదని నన్ను బాధించుచుండెను.

## దేవదాసి పిల్ల

డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డి స్థాపించిన అవ్వ అనాధశరణాలయమునుండి వైద్యమును నేర్పించమని యొకస్త్రీని నావద్దకుపంపెను. ఆమెతో కూడ 9 సం॥ల కుమారు డుండెను. ఈమెదేవదాసి. కొంత కాలము మాయింట నివసించి మంచి ఆరోగ్యమును సంపాదించుకొని మరలిపోయెను.

## హరిజన పిల్ల

ఒక హరిజన పిల్లనుదెచ్చి వైద్యశాలలో కొన్ని కార్యములను చేయుటకు నియమించితిని. ఈమెను యింటికి తెచ్చునప్పుడు ఈమెజాతి ఫలానిదని చెప్పకూడదని అనేక విధములుగ బోధించితినిగాని ఆ పిల్లజాతిని మాయింటి వారు సులభముగ ఆమెనోటి గుండనే తెలుసుకొని వెంటనే ఆమెను యింటి నుండి తరిమి వేసి ఇల్లంతయు పుణ్యాహవాచనమును చేయించిరి.

## కాత్యాయిని

గుంటూరు శివాలయములో యేతల్లియో కనిపారవైచిన ఆడశిశువు శారదానికేతనమున వారికి లభించెను. వారాశిశువును తీసుకొనిపోయి పెంచు చుండిరి. శివుని ప్రసాదమైనందున అబిడ్డకు, కాత్యాయినియని పేరు పెట్టి మురుసుకొనుచుండిరి. ఈబిడ్డను నాబిడ్డగ పెంచుటకు శారదానికేతనమువారు నన్ను కోరియుండిరి. ఇందుకు నేను సంతోషముతో సమ్మతించి ఆ బిడ్డకు అగు ఖర్చును నేనే భరించుచుంటిని. ఆ బిడ్డకు యిప్పుడు 10 సం॥ వయసు. ఆమె చిరంజీవియై లోకారాధన చేయుటకు దేవుని ప్రార్థించుచున్నాను.

ప్రత్యేకముగ అనాధశరణాలయమును స్థాపించి వానిని పరిపాలించు సామర్ధ్యము లేకపోవుటవలన కొందరు అనాధస్త్రీలను దగ్గరదీసి నావైద్యశాల లోనే బ్రతుకుదెరువు పనులను నేర్పించుచున్నాను. మందులను తయారు చేయుట, మందులను విక్రయించుట, మందులను ప్యాక్‌చేయుట, తల నూనెలను తయారుచేయుట, నర్సుపనులను నేర్చుకొనుట, గృహలక్ష్మి కార్యాలయమున అచ్చుకూర్చుట మొదలగుపనులను నేర్పించి వార్లకు జీవనా ధారమును కలుగ చేయుచున్నాను.

మొత్తమునకు నా అనుభవముమీదను, ఇతరుల అనుభవముగ మనిం చుట చేతను భార్యభర్తలన్యోన్య విశ్వాసముకలిగి, సానుభూతితో పనిచేయ గల్గినగాని పతితోద్ధారక పూర్వకమగు మానవసేవ కడుకష్టదాయకము ; అప నిందలకు మూలము అని నా మనసునకు స్పష్టమైనది.

కావుననే కాబోలు - అవ్వ అనాధశరణాలయ స్థాపకులు ఆ సంస్థ ప్రణాళిక యందలి ప్రధమసూత్రమునందే - వివేకానందుని ఈ క్రిందివాక్యమును తమ కాదర్శముగా గైకొన్నారు.

"దిక్కుమాలినవారి నుద్ధరించుట నా మతము ; వారి నుద్ధరించుటకై అవసరమైన నరకమునకైన వెళ్లుట నా మతము."

# 20 నాటు వైద్యము - మోటు చికిత్స

నేను పుట్టిన నాటుపురంనందు చిన్ననాడు కొన్ని నాటుచికిత్సలను, మోటువైద్యములను చూచుచుండినది నాకు ఇప్పటికిని జ్ఞాపకమున్నది.

చంటిబిడ్డలకు చిన్నబిడ్డచేష్టయను ఈడుపువాయువు వచ్చినప్పుడు వారు కండ్లు తేలవేసి, స్పృహతప్పి, కడుపుబ్బి కష్టపడుచుందురు. అప్పుడు తల్లి తహతహలాడుచు ఇరుగుపొరుగు అమ్మలక్కలకు చూపించును. చూడవచ్చిన వారిలో వారివారి అనుభవముల ననుసరించి ఒకతల్లి జిల్లేడాకులరసమును బిడ్డ ముక్కులనిండుగ పిండును. మరియొక తల్లి కుంకుడుకాయ నురుగు ముక్కులలో పోయును. పుల్లమ్మ వచ్చి పసుపుకొమ్మును దీపమున కాల్చి కను బొమ్మలనడుమను గట్టిగ వత్తికాల్చును. ఎల్లమ్మవచ్చి కాకరాకు పసరు మంచి దని చెప్పును. త్రోవనుపోవు పిచ్చిరెడ్డివచ్చి తాను పీల్చుచున్న లావాటి పొగ చుట్టతో శిశువు ముఖమున కాల్చును. మరియొక అనుభవశాలి వచ్చి బిడ్డపొట్ట మీద సూదులతోను, దబ్బనముతోనుకాల్చి వాతలు వేయును. పిమ్మట



?

"Father, is it true that Mareecha who was thrown miles and miles away at the *YAGA* of Viswamitra, turned a new leaf and started living as a hermit ?"

"You are correct, Raghu. While Subaahu was dead, Mareecha had been spared but the taste of Rama's Arrow by his blood as well as soul, changed him completely. He became pious and was leading a life of penance till Ravana approached him with a strange command of asking him to become a golden deer."

"When Mareecha was living as a recluse in an ashram, couldn't he say 'no' to Ravana ?" was the query of Raghu.

"He told Ravana : "This Prince of Ayodhya is no ordinary person - he is divinity incarnate. And I am speaking from my personal experience. If you abduct Seeta, believe me, you will bring disaster and doom not only on yourself but on the entire kingdom of Lanka.' . . Ravana chided him ; 'I seek not your counsel - you are my subject and you have to obey me or die at my hand.' ... Mareecha, having tasted the ecstacy of Rama's Arrow once, preferred to be slain by that charming, divine figure than by a cruel, self-seeking, arrogant demon," explained Raghu's Father.

---





మంత్ర, తంత్రవేత్తలు వచ్చి రక్ష రేకులనుకట్టి దిగదుడుపులను దుడిచిపోవుదురు. ఈ నోరులేని పసికూనలు ఇన్ని మోటుచికిత్సలకు గురియై జీవించినను, పెట్టినవాతలు పుండ్లుఅయి, చీముపట్టి, చిరకాలము బాధపడుదురు. బాల్యమున యిట్టిచికిత్సలకు లోనైనపలువురి ముఖముల మీదను పొట్టలమీదను కాల్చిన మచ్చలను చూచుచున్నాము. మరికొందరు చిన్నబిడ్డ చేష్టకానుపించిన తోడనే బిడ్డను వాలినంపయెత్తున యెగురవేశి పట్టుకొనుచుందురు. మరికొందరు ఏమియు తోచి తోచని ఉద్దేశములతో గిరగిర అల్లిబిల్లిమాదిరిగ త్రిప్పుచూ పరుగులిడుదురు.

వయసువచ్చిన ఆడుబిడ్డలు కొందరు బుతుస్రావదోషమువల్ల వాతోన్మాదమను మూర్ఛవల్ల బాధపడుచుందురు. వీరు అకస్మాత్తుగ స్పృహతప్పి నేలబడెదరు. పక పక నవ్వెదరు. భోరునయేడ్చెదరు. దగ్గిరనున్న వారిని కాళ్లతో తన్నెదరు, చేతులతో పీకెదరు. నోటనురుగును కార్చెదరు, బుసకొట్టెదరు, ఎగరొప్పెదరు, నలుగురు పట్టుకొనినను నిలువక విల్లంబువలె వంగి లేచెదరు. మరియు వీరు అనేక అవలక్షణములను ప్రదర్శించెదరు. ఈ లక్షణముగల స్త్రీకి దయ్యముపట్టినదని తలంచి భూతవైద్యుని పిలిపించి భూత చికిత్సను చేయించెదరు. వైద్యుడువచ్చి ఇంటిలో ముగ్గులను కలశమును పెట్టించి కొన్ని దినములు దివారాత్రములు శక్తినిపూజించి బలిదానములను సలుపుదురు. ఆ స్త్రీని ముగ్గులో కూర్చుండబెట్టి, సాంబ్రాణి గుగ్గిలముల వేసి ధూపమునువేసి మంత్రవేత్త మంత్రోచ్ఛారణతో దయ్యమును పారదోలుటకు పాతచెప్పులను, చింపిచాటలను, చీపురుకట్టలను ప్రయోగించును. ఈ బాధలకు ఆమె తాళజాలక కొంతసేపటికి సొమ్మసిల్లి నేల వాలును. అప్పుడు మంత్రవేత్త ఈమెను పట్టినదయ్యము పారిపోయినదని చెప్పును. ఇకను ఈమెకు గ్రహ బాధ లేకుండుటకు మెడలో తాయిత్తు రక్షరేకులుకట్టి బహుమతులను పొందిపోవును.

మంత్ర, తంత్ర, శాస్త్రవేత్తలనుపించుకొనువారు యింకను కొన్ని ఘాతుక క్రియలను జరిపెదరు. ముగ్గులో ఉన్మాదిని కూర్చోపెట్టిన తర్వాత మాడుననున్న వెంట్రుకలను గుప్పిటితో పట్టుకొని లాగుదురు.

ఇటీవల నొకచోట నొకమాంత్రికుడు తాంత్రికముగా డబ్బు సంపాదించవలెనన్న కోరికతో స్త్రీల దయ్యములను వదలకొట్టి, సంతానరాండ్రుగ చేసెదననిచెప్పి వారు వచ్చిన తర్వాత హింసించి కాయములనే మాయము గావించి యున్నట్లుకూడా విని యుంటిమి.

సన్నిపాత జ్వరము లేక విషమజ్వరము (టైఫాయిడ్ జ్వరము) వచ్చినప్పుడు రోగిని 21 దినములు లంకణములనుంచెదరు. దీనిని మా

ప్రాంతములలో లంకణముల జ్వరమని కూడ చెప్పెదరు. ఈ జ్వరితునకు నాటువైద్యులు వచ్చి కొన్ని కుప్పెకట్లకణికలను వాది పోసెదరు. తెల్లజిల్లేడాకుల పసరును, కాడజముడుకాడల స్వరసమును, ఆకుజముడు పొంగురసమును అనుపానములుగ వాడెదరు. వాడిన మందుల పేరులడిగినప్పుడు, ఇది కాల కూటరసమనిన్ని, సన్నిపాత భైరవిరసమనిన్ని, ప్రతాపలంకేశ్వరరసమనిన్ని, చండ మార్తాండ రసమనిన్ని, మృత్యుంజయ రసమనిన్ని చెప్పెదరు. ఈ మందుల మోతాదును గమనించక కణికలను యెంతజాస్తిగ అరగదీసి యిచ్చిన అంతత్వరగ వ్యాధినివారణ యగుననే తలంపుతో మందును అతిమాత్రగ వాదియిచ్చెదరు. కొన్ని సమయములలో ఈ మాత్ర అతిమాత్ర అయి రోగి అంతరించుటయు సంభవించును. ముఖ్యముగా నీ వేడి మందులవల్ల రోగికి ఇరువాయగట్టి మలవిసర్జనముకాదు. ఆ మల విసర్జనకై ఆసనమున కుంకుడుకాయ నురుగు పెట్టుట కొందరికి సంభవించును. అనేక మోటు పనులున్నూ చేయుదురు. సన్నిపాతజ్వరితునికి నాలుకపైన ముండ్లు లేచుట కొందరికి సంభవించును. ఈ ముండ్లు ఊడిపడుటకు ఉప్పుగండ్లను నాలుకమీద వేసి రక్తముకారు వరకు రుద్దెదరు. అప్పుడు ఆ ముండ్లు వూడిపోవును. ఈ చికిత్స పశువులకు కూడ చేయుదురు.

మరియు ఈ సన్నిపాతజ్వరము మందులకు మానకుండిన రోగియొక్క మాడును చివ్వి పట్టువేసెదరు. అనగ మంగలికత్తితోగాని, గాజుపెంకుతోగాని మాడున రక్తము కారువరకు చివ్వి, ఆ గాయముపైన ఔషధముల పట్టీలను, పట్టును వేసెదరు. ఇందువలన ఔషధముల వీర్యము రక్తముగుండ రక్తనాళములలో ప్రవేశించి రోగనివారణ అగుననే తలంపుతో ఆనాటి నాటువైద్యులు ఈ మోటుచికిత్సను చేసెడివారు.

ఈ కాలమున ఆంగ్లవైద్యులు సూదులతో మందులను రక్తనాళములోకి చొప్పించుటవంటిదే ఆ కాలపు మాడుచివ్వి పట్టువేయుట. ఆనాడు మరియొక చికిత్సను కూడ చేయుచుండుట నాకు దెలియును. అన్ని చికిత్సలు విఫలమైన పిదప అంత్యచికిత్స రోగికి గరళమును పోసెదరు – అనగా నాగసర్ప విషమును త్రాగించెదరు.

మా వూరిలో యెవరింటిలోనైనను ప్రసవవేదన పడుచుండగనే వూరి మంత్రసానియగు మంగలి బాపిగాడితల్లిని పిలువనంపెదరు. ఆమె వెంటనే తన కొడుకు మంగలి పొదిలోనుండి ఒక కత్తిని తీసుకొని పిలువనంపినవారింటికి వచ్చిచేరును. శిశువు భూపతనము కాగానే మంత్రసాని తెచ్చినకత్తితో బిడ్డ బొడ్డును కోసి పసుపును పట్టించును. బొడ్డును కోసినకత్తినితెచ్చి మరల కొడుకు పొదిలో పెట్టును. (ఇంకా వుంది)

ప్రజా జీవితంలో

# హింసాత్మక పద్ధతులు

## యన్నార్ చందూర్

'ప్రజా జీవితం' అనే మాటకు ఎంతో విస్తృతమైన అర్థం ఉంది. 'ప్రజ అనగా ఎవరు? భౌగోళిక సరిహద్దులకు లోనైన ఒక దేశంలో, అనేక మత విశ్వాసాలు, భాషలు, సంప్రదాయాలు మధ్య, తమ అలవాట్లు, ఆచారాలు, విద్యాబుద్ధులతో, సమిష్టిగా, కలిసి బతికే జనవాహిని. వారి వృత్తి వ్యాపకాలు, ఆర్థిక వ్యత్యాసాలు, వనరులు, అవకాశాలు, అభిరుచులు, అభిప్రాయాలు మళ్లీ వేరు వేరుగా ఉంటాయి. అయితే, సామూహిక క్షేమం కోసం, సామూహిక రక్షణ కోసం ఒకటై మసులుకుంటూ వుంటారు. ఈ ఏకత్వంలో వైవిధ్యమూ, భిన్నత్వమూ లేకపోలేదు.

'ప్రజలే ప్రభుత్వం - ప్రభుత్వమే ప్రజలు' - అని వేదికల మీద చెబుతూంటారు. అది కేవలం నినాదం మాత్రమే. కాగా ప్రతి నినాదంలోను 'అర్థసత్యం' ఉంటుంది-'హాఫ్‌ట్రూత్'. ప్రజల ఎన్నుకొన్న ప్రజా ప్రతినిధులే ప్రభుత్వం నిర్వహిస్తారు; వారు పాలకులు; ప్రజలు పాలితులు. ఈ పాలకులని; ప్రజలు, రాజ్యాంగ నియమానుసారం ఎన్నుకు, అధికార స్థానాలలోకి పంపుతారు. ప్రజా సేవా చేసేందుకే, నియోజక వర్గ ప్రాతినిధ్యం కోరుతున్నామని, అభ్యర్థులు అందంగా చెబుతారు. అది నిజం కాదని ప్రజలకు తెలిసినప్పటికీ, పోటీదార్లలో ఎవరు తక్కువ హానికరమో వారిని గెలిపిస్తారు. అయిదేళ్లకొకసారి వచ్చేదైనప్పటికీ యిది ప్రజా జీవితంలో ముఖ్యమైన పండగ. స్థానిక సంస్థల్లోను, సహకార యంత్రాంగంలోను అయితే, అయిదేళ్లదాకా ఆగనక్కర్లేదు - ఈ లోపునే వస్తాయి యిలాంటి పండగలు.

విద్యార్థి సంఘాలు, లోకల్ క్లబ్బులూ నుంచి పార్లమెంటు దాకా ఎన్నికలంటే అందరికీ సరదాయే! స్టూడెంట్స్ యూనియన్నే ఎన్నికలకు ఏభై అరవైవేలూ, కొన్ని చోట్ల లక్షా ఖర్చు పెడుతూంటే, శాసన సభకు, లోక్‌సభకు ఎంత ఖర్చు పెట్టడం సమంజసమో మీరే అంచనా వేయండి. ఇందులో ప్రయివేట్ ఎంత, పబ్లిక్ ఎంత - అని మనం అడక్కూడదు; వారు చెప్పకూడదు. రెండు మూడు వారాల క్రితం ఈ మద్రాసు మైలాపూర్‌లో ఒక యువజన నాయకుడు, కారు స్టీరింగ్ ముందు కూచున్న

మరొక యువజన నాయకుని, కత్తితో పొడిచి కైలాసానికి పంపించాడంటే, అసహనమూ హింసా ప్రవృత్తి ఏ స్థాయికి చేరుకున్నాయో అర్థం చేసుకో వచ్చు. అంతటి ఆగ్రహానికి కారణం అవతలతని పేరు పోస్టర్‌లో వేయ లేదట. అదే కావచ్చు, ఇంతా ఇ తరం ఉండవచ్చు, కాని ఏమైనప్ప టికీ ఒక నిండు ప్రాణం 'హరీ' అంది.

ఏ ఎన్నికయినా సరే పదవీ, అధి కారమూ కోసం! సామాన్యంగా పదవిని అంటిపెట్టుకు వుంటుంది అధి కారం. అధికారం మనని, మన చుట్టూ వారికంటె, అధికులుగా గుర్తింపు తెస్తుంది. నలుగురూ కలిసి బతిమాలగా, ఆ బాధ్యత నెత్తిని వేసుకొనేవారు వెనకటి రోజులలో; ఇప్పుడలాకాదు; ఏదోవిధంగా ఆ స్థానం చేజిక్కిం చుకు, నలుగురినీ తన వెంట నడవ మనడం, లేదా, తను చెప్పినట్లు విన మనడం .. అదే అహింసకు, హింసకు గల దూరం.

మన స్వాతంత్ర్య సమర సారధి గాంధీజీ, శాసనోల్లంఘనం - సివిల్ డిజ్‌ఒబీడియన్స్, - అహింసా యుత మనీ, అది హింసాకాండకు - క్రిమినల్ డిజ్‌ఒబీడియన్స్‌కి - ఏనాడూ దారి తీయదనీ ఖచ్చితంగా చెప్పారు అన్నిటి మాదిరే స్వాతంత్ర్యం కూడా కొన్ని షరతులు పెడుతుందనీ, కొన్ని పరిమితులు విధిస్తుందనీ, పుట్టుకవల్ల ఔదార్యమూ సంపద వల్ల ఔన్న త్యమూ చేకూరవనీ, ఈ ప్రపంచం లోని యావత్తు ఆయుధ సంపద కంటే అహింసా శక్తి గొప్పదనీ, దానిని ఒక కళగా ఒక విజ్ఞాన శాస్త్రం లా తీర్చిదిద్ది, 'సత్యము' అనేది అందని పుష్పం, 'అహింస' అనేది ఆచరణ సాధ్యమైన జీవన మార్గం - అన్నారు గాంధీజీ.

'ఎండ్స్ అండ్ మీన్స్'- గమ్యము, మార్గము. అనుసరించే మార్గంలో మాలిన్యం లేనప్పుడే గమ్యం ఫల ప్రదమవుతుందని గాంధీగారే కాదు, బుద్ధుడు, జీసస్ క్రైస్ట్, థొరొ, రస్కిన్, టాల్‌స్టాయ్ ఎందరెందరో అన్నారు. కాని, గత ముప్ఫయ్యేళ్లగా హింసా ప్రవృత్తి, ఒక్క మన దేశంలోనే కాదు. ప్రపంచమంతటా పెరిగింది. పౌర విమానాల హైజాకింగ్‌తో ప్రారంభ మైన 'టెర్రరిజమ్', సంపన్న దేశాలు తీసుకున్న జాగర్తలవల్ల అదుపులోకి వచ్చింది. హింసకంటె అహింస ఎప్పుడూ గొప్పదే - ఆ విషయంలో ఎటువంటి సందేహమూలేదు. అయితే, ఈ హింసాప్రవృత్తి మానవజాతి నుంచి ఎటువంటి మూల్యం కోరు తున్నాడో పరిశీలనగా చూస్తే ఆశ్చర్య మేస్తుంది.

ఈ శతాబ్దిలో జరిగిన అన్ని యుద్ధా లలోను మృతులైన వారి సంఖ్య 3 కోట్ల 60 లక్షలు. పోతే, జాతికల హాల వల్ల, ప్రభుత్వాల అలక్ష్యమూ దురహంకారం వల్లా, మృతులైన వారి సంఖ్య 11 కోట్ల 90 లక్షలు; ఇందులో 11 కోట్ల చిల్లర, నియం

తృత్వ రాజ్యాలలో హతులైనవారు; ఒక్క నాజీ జర్మనీయే 60 లక్షల మంది యూదులను పొట్టనెట్టుకొంది - ఒక వర్గాన్నో, ఒక మతాన్నో, ఒక తెగనో నిర్మూలించాలని, ప్రభుత్వ పాలకులే తలపెట్టినప్పుడు, యిక ఆ మూగ ప్రజకు దిక్కేమిటి? 1850-1941 - ఈ మధ్యకాలంలో బ్రిటన్ 20 యుద్ధాలలో పాల్గొంది; అలాగే ఫ్రాన్సు 18 యుద్ధాలు చేసింది - ఇరువురూ తమ సామ్రాజ్యం నిలబెట్టు కొనేందుకే! అమెరికా ఏడు యుద్ధాలు చేసింది .... నెపోలియన్‌కి పూర్వం యుద్ధాలనేవి సైనికుల మధ్య జరిగేవి. ఆ తర్వాత పరిస్థితి మారిపోయింది. శత్రుదేశంలోని ప్రజలందరూ శత్రువు లయారు.

ఇదందా ఎందుకు చెబుతున్నా నంటే, హింసకు పరాకాష్ఠ యుద్ధం. ఈ యుద్ధాల ప్రభావం మాన వాళి ఆలోచదారీతులపై పని చేసింది, చేస్తోంది 18వ శతాబ్దంలో ఇమాన్యు యల్ కాంట్ అనే తత్వవేత్త. అధిక సంఖ్యాకులని ఆదుకో గలిగినది 'డెమొక్రసీ ఒకటే' అన్నాడు. స్వాతం త్ర్యము, హింసా ప్రవృత్తి బద్ధ విరోధ మైనవనీ, హింసను అదుపులో పెట్టి, మానవ స్వాతంత్ర్యా కాపాడ గలిగేది డెమొక్రసీ మాత్రమే అని, ఆయన చెప్పాడు.

మనది పార్లమెంటరీ డెమొక్రసీ, లోక్ సభ, రాజ్యసభ, ప్రెసిడెంటూ - ఈ మూడూ కలిసి పార్లమెంటు అవు తుంది. ఎగ్జిక్యూటివ్, జ్యుడిషరీ స్వయం ప్రతిపత్తి గల విభాగాలు.

మొన్న లోక్‌సభ ఎన్నికలలో ఎన్నో అవాంఛనీయ సంఘటనలు జరిగాయి. అసెంబ్లీ ఎన్నికలకు, ముందు జాగర్తలు తీసుకుంటున్నామ న్నారు. బీహారులోకి ఎవరూ కొత్త వారు రాకుండా కట్టుదిట్టం చేశా మన్నారు; 200 కంపెనీల సెంట్రల్ పారామిలిటరీ ఫోర్స్ ఉందక్కడ; అయినప్పటికీ భారీ ఎత్తున రిగ్గింగ్, బూత్ కాప్చరింగ్, హత్యాకాండ జరి గాయి. హర్యానాలోని 'మెహామ్' సంగతీ యింకా ఘోరం.

పార్లమెంటరీ ప్రజా స్వామ్యానికి, సభ్యతాయుత వర్తన, ప్రాణధాతువు వంటిది. సంస్కారం, సంస్కృతి, సంప్రదాయం - ఈ మూడూ హింసను దూరంగా నెట్టి, సౌమ్యతకు పట్టం గడతాయి. ధనబలం, అధికార బలం ప్రజాశక్తి ముందు దూదిపింజలు! ప్రజలు తమ జీవితాన్ని సక్రమంగా, సగౌరవంగా సరిదిద్దుకోగల అవకాశ మిస్తుంది పార్లమెంటరీ ప్రజాస్వామ్యం! మానవ నాగరికతా మహావృక్షానికి ప్రజాస్వామ్యమనే ఒక తియ్యటి ఫలం.

ప్రజాస్వామ్య పరిరక్షణ ద్వారానే హింసను అరికట్టి, ప్రజాజీవితాన్ని శాంతియుతమూ, సుఖప్రదమూ చేయ గలుగుతాము. ఆ పరిరక్షణకు మార్గాలు వెతకటమే నేటి తక్షణ కర్తవ్యం.

'ఆకాశవాణి' సౌజన్యంతో

# చందూర్ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్‌మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాధ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వెర్షిస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవ చైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యటం

పరిచయం చేసిన పుస్తకాలు

ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్త లోకాలు
కొన్ని గ్రంధాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడో లేడో
మావో పాలనలో
చైనాలో మైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలను కున్నవారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి




3

## ఏప్రిల్ 13, 1990

ప్రఖ్యాత తమిళ రచయిత్రి శివ శంకరి 'అల్‌కొహలిజమ్' (మద్య పానం), మీద, 'డ్రగ్స్' మీద సంచలనాత్మక రచనలు గావించారు. ముఖ్యంగా 'అల్‌కొహలిజమ్' మీద ఆమె వ్రాసిన 'ఒరు మనిదన్ కథై' ('ఒక మనిషి కథ' - మాలతీ చందూర్ తెలుగు అనువాదం.... క్వాలిటీ పబ్లిషర్స్, విజయవాడ - 2) 'ఆనంద వికటన్'లో సీరియల్‌గా వచ్చి, ఎన్నో మధ్య తరగతి కుటుంబాలను కదిపి, కుదిపి, సుషుప్తినుంచి లేవనెత్తింది. ఆ పైన పుస్తకరూపాన వచ్చి, ఎందరినో జాగృతం చేసింది. 'డ్రింక్' అనేది సరదాగా ప్రారంభమయే అభ్యాసం - ఆ పైన యినుప గొలుసుల్లా కట్టివేసే అలవాటు. మానేదామనుకుంటూనే మానలేక పోతారు - మనోబలం లోపిస్తుంది. భార్య, పిల్లలు, మిత్రులు, కావలిసిన వారందరికీ దూరమవుతున్నామని తెలుసు. అయితే, ఆ వుచ్చుల నుంచి తప్పించుకోలేక పోవడం ఒక వ్యాధి అనీ, ఒక రుగ్మత|అనీ, వైద్యోపచారంతో ఆ వ్యాధిని జయించవచ్చుననీ గ్రహింపనేరరు. అలా అంధకారంలో సడి కొట్టుకుపోతూంటారు.... 'అల్ కొహలిజమ్' ఒక జబ్బు అనీ, అది కుదర్చడానికి వీలయే జబ్బు అనీ, ఆధునిక వైద్యశాస్త్రం అంగీకరిస్తున్నది. 'అల్‌కొహలిక్ యనానిమస్' అనే అంతర్జాతీయసంస్థ ఈ విషయంలో దేశవ్యాప్తంగాను, ప్రపంచ వ్యాప్తం గాను అద్వితీయ సేవ చేస్తూన్నది. అలాగే మద్రాసులో 'రంగనాథన్ ఇన్‌స్టిట్యూట్' (అడయార్) ఆదర్శ ప్రాయంగా కృషి చేస్తున్నది ఇండియన్ బాంక్ వారు (అధ్యక్షులు : గోపాల కృష్ణన్), 'అగ్ని' ట్రస్ట్ (AGNI) వారి శివశంకరి 'ఒరు మనిదన్ కథై' వీడియోకాసెట్‌ని రిలీజ్ చేశారు. థక్కర్‌బాపా ఆడిటోరియమ్‌లో - ముఖ్యముగా పబ్లిక్ సెక్టార్ సంస్థల లోని కార్మికులకి, ఉద్యోగులకి చూపే నిమిత్తం! ఇండియన్ బాంక్ గోపాలకృష్ణన్ ఈ విషయంలో ముందంజ వేయడం, ఎంతో ప్రశంస నీయమగు విషయం. ఈ సమావేశం థక్కర్ బాపా విద్యాలయంలో

జరగడం ముదావహమైన విషయమనీ, గాంధీజీ ప్రబోధాలే భారతజాతికి మార్గదర్శకాలనీ అన్నారు తమిళనాడు గవర్నరు అలెగ్జాండర్ - ఈ వినూత్న ఉద్యమాన్ని ప్రారంభిస్తూ! తమిళనాడు మంత్రి అంబళగన్ సభాధ్యక్షత వహించగా, కాంగ్రెస్ నాయకులు మూపనార్, శివశంకరి ప్రయోజనాత్మక రచనను మెచ్చుకుంటూ, ఆమెని సన్మానించారు. శాంతీ రంగనాధన్, డా॥ రామచంద్రన్ ఈ రంగంలో తాము చేస్తున్నది వివరించారు. పదమూడుసార్లు తన కారుని యాక్సిడెంట్‌కి గురి చేసిన, ఇండియన్ బాంక్ బ్రాంచి మేనేజరు వాసు, తను ఏవిధంగా ఈ కోరల నుంచి బయట పడినదీ జంకు గొంకులు లేకుండా, ప్రత్యక్ష ఉదాహరణగా చెప్పారు. ఇటువంటి చైతన్య కారకమగు సత్ప్రయత్నం తమిళనాడుకే గాక, మిగతా రాష్ట్రాలకు కూడా వ్యాప్తి చెందవలసిన అవసరం ఎంతైనా ఉంది.

. . . . . 23

నాలుగు సంవత్సరాల క్రితం ఇదే రోజున పూజ్యులు వియన్ శర్మగారు, కోడైలో సాయంత్రం నాలుగు గంటల వేళ, భక్తి గీతాల టేప్ వింటూ, ఆ తన్మయత్వంలో ఇహలోక యాత్ర చాలించారు - అటువంటి సునాయాస మరణం పుణ్యపురుషులకు గాని లభించదంటారు. శర్మగారిది పరిపూర్ణ జీవితం. మద్రాసు మైలాపూర్‌లో ఆదర్శప్రాయమగు 'బాలోద్యాన వనం' స్థాపించారు. ఆరుగురితో ప్రారంభమైన ఆ స్కూలు యిప్పుడు రెండువేల మందికి విద్యాదానం చేస్తున్నది - కుమార్తెలు ముగ్గురూ తలిదండ్రులు వెలిగించిన జ్యోతిని చేబట్టారు. (శకుంతలా శర్మ, గీతాశర్మ, రుక్మిణీ పప్పు).... శర్మగారితో మా కుటుంబంలోని యావన్మందికీ ముప్ఫయ్యయిదేళ్ల అనుబంధం - ఆయన లేకుండా ఏ శుభకార్యమూ జరిగేది కాదు. ఆయన మాలో ఒకరు - మా అందరికీ ప్రేమానురాగాలు పుష్కలంగా పంచిపెట్టిన అమృతమూర్తి. ఆయన భౌతికంగా లేకపోవచ్చు, కాని, మా యింట్లో మా మధ్య ఒకరై ఉన్నారు. 'కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనాకాదయః' (గీత - 3 : 20).... అటువంటి జనకమహర్షి వంటి శర్మగారిని సంస్మరిస్తూ, ఈ ఉదయం ఒక గంట సేపు ప్రార్థన గీతాలు పాడారు చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలులో.

మే 03, 1990

మోహన్ కూమారి, యన్ శేషాద్రీల (అసిస్టెంట్ కమీషనర్ : ఇన్‌కమ్ టాక్స్) కుమార్తె సౌ॥ మీనాక్షికి, ఆంధ్రా హైకోర్టు జడ్జి రామానుజులు నాయుడు కూమారుడు చి॥ వెంకటరమణ మూర్తికి, ఈ ఉదయం ఆరూ ఏడు గంటల మధ్య, తులాలగ్నంలో ధర్మప్రకాష్‌కళ్యాణ మండపంలో శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. ఉదయం మూహూర్తానికి, సాయంత్రం రిసెప్షన్‌కి బంధు మిత్రులనేకులు వచ్చి నూతన వధూవరులను ఆశీర్వదించారు ఆ

ఆశీర్వచనాలతోబాటు మా శుభాభినందలు .... ప్రముఖ పారిశ్రామిక వేత్త ఓబుల్ రెడ్డి దంపతుల కుమార్తె సౌ॥ రోహిణికి, హైదరాబాదు ఇవి రామ్ రెడ్డి దంపతుల కుమారుడు చి॥ భరత్‌కి, సాయంత్రం ఏడూ ఎనిమిది గంటల మధ్య శాస్త్రోక్తంగా విజయాశేష్ మహల్‌లో వివాహం జరిగింది. నిన్న సాయంత్రం ప్రధానానికీ, ఈ సాయంత్రం ముహూర్తానికి మద్రాసు నగరంలోని పెద్దలందరూ అక్కడే ఉన్నారు. షేక్ చిన్న మౌలానా బృందం వారి నాదస్వరం.... నవదంపతులకు మా మనఃపూర్వక శుభాకాంక్షలు.

. . . . . 11

ట్రిమ్మింగ్ అయి, మొదటి పది కాపీలూ టేబుల్‌మీదకి రాగానే, ఒక కాపి యిటూ అటూ తిరగేసి, మేడ మీదకి పంపటం అలవాటు. మర్నాడు భోజనాలవేళ, అచ్చుతప్పులు గాక, యింకేదయినా పొరబాటువుంటే, ఎందుకిలా జరిగిందని అడుతుగుంది శారదాంబ. నెమ్మదిగా సంజాయిషీ చెప్పుకుంటాను.... 'రంగారావు గారు నిన్నూ మాలతినీ సుబ్బూ (రాజాగారి అమ్మాయి) యింటికి తీసుకువెళ్లారనీ, ఆమె భర్త కూడా (డాక్టరుగారు)' మీ కోసం ఎదురు చూస్తూవున్నారనీ, మువ్పావుగంట వారింట్లో ఎంతో సరదాగా గడపామని, టిఫినులూ వాటితో వుక్కిరి బిక్కిరి చేశారనీ చెప్పావుకదా - ఆ విషయం వ్రాయటం ఎలా మర్చిపోయావ్? విశాఖపట్నంలో వర్షం

జ్ఞాపకం వుంది గాని ఈ స్నేహ సౌశీల్యాలు ఎలా మర్చిపోయావ్?' - అని సూటిగా ప్రశ్నించింది శారద.... పొరబాటే! 'డైరీ' వ్రాస్తున్నప్పుడు ఒక్కోసారి అనుకోకుండా యిలాంటివి దొర్లుతూంటాయి. ఉదయం మేము విజయనగరం వచ్చీ రాగానే మమ్మల్ని చూడటానికి వచ్చిన ఆ దంపతుల ఆదరాభిమానాలు మర్చి పోగలమా? సుబ్బూ ఆరోగ్యం బాగుపడి, తొందరలో మామూలు మనిషి అవాలని, మనసార కోరుకుంటున్నాము.

..... 19

ప్రేమ్‌చంద్ దంపతుల కుమారుడు చి॥ శరత్ చంద్రకి, కృష్ణస్వామి దంపతుల కుమార్తె సౌ॥ మీరాకి, ఈ నెల పదకొండో తేదీ ఉదయం, దిగువ తిరుపతిలో సంప్రదాయ సిద్ధంగా వివాహం జరిగింది. హైదరాబాదు బంధువులు రాగలిగారు గానీ, తుపాను కారణంగా గుంటూరు బంధువర్గం రాలేక పోయారు. సరోజినీ, ప్రేమ్‌చంద్‌లు మాకెంతో కావలసిన వారు - ఆప్తులు, అతి సన్నిహితులు, పెళ్ళికి ముగ్గురం వెళ్ళివుండాల్సింది - కాని, కారణాంతరాలవల్ల నేనూ మాలతి వెళ్లడం పడలేదు; శారద మాత్రం వెళ్లింది.... ఇవాళ 'ఛోళా'లో రిసెప్షన్. ఇరువురి తరపు బంధుమిత్రులు నూతన దంపతులకు శుభాకాంక్షలు తెలిపారు.... అబ్బాయీ, అమ్మాయీ యిద్దరూ అడ్వర్టయిజింగ్ లైన్ లోనివారు. ఆ విధంగానే వారికి స్నేహం కుదిరింది - ప్రేమకలిగింది - పెద్దల ఆమోదంతో పెళ్లి చేసుకున్నారు. ఇరువురూ ప్రస్తుతం బెంగుళూరులో పని చేస్తున్నారు. మహాత్మాగాంధీ రోడ్‌లో కొత్తఫ్లాటు, కొత్త ఫర్నిచరు, కొత్త జీవితం. ఈ నవ దంపతులకు సర్వశుభములు చేకూరాలని మా ఆశీస్సు, ఆకాంక్ష!

—యన్నార్ చందూర్

# A Week in Kerala

*Tuesday - July 26, 1988*

In the second week of July one afternoon Radha Sivaswamy telephoned to say: "You two and we two, the four of us, are leaving Madras on Monday, the 25th July, by the Cochin Express for a week's holiday in Kerala. Just now I am back from the Central with the tickets. We will send you back that Sunday or Monday while I stay there for a fortnight. No further postponement. It is all decided and our itinerary has been chalked out. Sivaswamy is coming this Saturday and we are leaving on Monday night. You may be missing your previews and press-meets but you will enjoy the holiday. To Malati Garu I shall speak leisurely afterwards."

We have been planning this Kerala trip since February this year. "Come to Kerala when I am there," said Sivaswamy on three or four occasions. He was transferred from Madras to Ernakulam early this year. don't know how long they keep me there. One fine morning I might be asked to go to Delhi or to some other place," Sivaswamy had been telling us. He was Commissioner of Incometax for the Kerala Region and a top-man in that department along with Mr. Kesavan at Trivandrum.

Who wouldn't love spending a week in that enchanting Kerala with coconut groves, silent backwaters, Kathakali, Puranic lore and the philosophy of Advaita? To drink deep from that well of culture, five days are not enough but living in this jet-age we have to satisfy ourselves only by touching the fringes.

As we were guests of the Sivaswamy Couple, we had nothing to plan in advance and we simply came to Madras Central well on time, just to step into our compartment. The Sivaswamy Couple joined us some ten minutes before the departure. As the train started moving, "Swamiji is always like this. However early I prepare myself for the journey, on some count or

other, he manages to delay matters and we rush on to the platform at the last moment. 'The tickets are with us and the Chendurs might feel anxious', I have been repeatedly telling him," complained Radha.

"Today it is different. I have to settle the transaction for that rental flat in the Atkinson Road and make the party receive the advance, as we have to vacate the Sastry Bhavan Govt. quarters before the month-end," said Sivaswamy in defence. Conversation went on for some time and by nine we felt like retiring. Sivaswamy preferred the upper berth as he wanted to sleep till the train actually enters the Ernakulam Railway Platform. We had slept well and by the time we opened our eyes it was Palghat and Radha had already ordered three cups of steaming hot coffee. Though it was not raining, everybody had an umbrella in hand. Kerala, as we know, has a very heavy rainfall and any moment it might start drizzling that turns out into heavy downpour.

The word Palghat brought in a train of memories to my mind. In my younger days I heard of Pa lghat girls especially from the brahmin community, being sold in marriage to middle-aged and elderly men in the Coastal Districts. Maybe the poverty made the parents accept the bride-money and send away the small girls for life to a place where the language even is alien to them. The girl would have no opportunity of seeing her parents again unless they choose to visit her, if their monetary position permitted such a visit.

Illiteracy and ignorance sulked behind the mask of time-worn tradition and it was sheer economic exploitation. Gone are those days and the average Koralite girl, to whatever caste or community she belongs to, is better educated and better informed. By eight we were at Ernakulam and before nine at Wariam Road residence of Dr. NR. Sivaswamy, IRS. It was a spacious flat with four baths and four beds. While he went to the office, we were asked to discover for ourselves the charm and beauty of Cochin.

Just like Secunderabad and Hyderabad, Cochin and Ernakulam are one. It is a twin town under the Corporation of Cochin - known widely as

the Queen of the Arabian Sea. The Portugese, the Dutch and the British came in their ships to this town in search of fabled wealth. We know Vasco-de-Gama landed at Calicut in 1498 and came to Cochin in 1502 and subsequently died in Cochin Fort in 1524. He was buried in the St. Francis Church and his mortal remains were removed to Portugal fourteen years after his demise. When we visited that Church in the evening, I had two visions of Vasco-de-Gama - an explorer, an architect, an adventurer of indomitable courage - that is one picture ; and the other one - an able administrator, a ruthless ruler and an intolerant governor-general. The two pictures mingle with each other and we find a portrait of a personality submerged in historical dust.

Our first discovery of Cochin started with our lunch at the nearby Dwaraka Hotel. Sivaswamy was to join us ; he had to rush to the office in the morning. "Let us not wait for him. I am feeling hungry. Shall we ask for Bombay meals ?" said Radha.

"As you like," responded Malati.

The supervisor while taking down the order, looked at me as though trying to recollect something, and enquired in undertones :

"Are you from Madras, Sir ?"

"Yes. Madras - Mylapore", I replied with a smile.

"I worked in Bamboo Hut for nearly two years. About eight months back I came down to Cochin and since then I have been working here. I know Telugu - I come from Chittoor, My name is Raju." He beamed with a sense of joy on coming across Telugu - speaking people - that inexplicable bond of mother-tongue.

Bamboo Hut was famous for its giant-size family dosai of staggering length. Two servers in four plates fetch it to your table and all the members of the family seated on four or six chairs, start cutting it at the ends and in the middle, and enjoy taking it with potato curry, or chutney or sambar. A real fun.

Radha lost no time in complimenting us for having know earlier the first individual we came across in Cochin. The food was quite delicious with the extra attention paid by Raju and Sivaswamy could not join us for lunch. Maybe

he was held up at the office with a heavy burden of work.

"Soon after lunch and beeda, we wished Raju all the best and moved on to our first visit as scheduled to the Jewish Synagogue at Mattancherry. A few days earlier Malati had watched on the Madras TV, a documentary made on this particular synagogue and the moment we arrived at the premises, she could recognise Mr. Cohen and said "I had seen you on the screen."

"How did I look?" he asked with a broad smile.

"Quite charming. As charming as you are now."

He is an elderly gentleman full of wit and wisdom. Of the Cohen Couple, one is an advocate and the other an auditor. Prior to 1948, before the birth of Israel, there were four hundred Jews in Mattancherry. The new land of great hope, drew the younger blood while the sober ones stayed back. Now in Mattancherry there are only 28 Jews of whom four are advocates and five are professors. There are fourteen women - all beyond middle age. "It is ages since we celebrated a Jewish marriage at this synagogue" observed Mr. Cohen.

He showed us the place of worship, gold crowns, copper plates, edicts and such things that take you back into bygone centuries. The King of Cochin granted them five villages and there was a time when a Jewish Brigade was formed to defend the throne of Cochin. The Jewish community lived in perfect amity with the local population and now what remained are only crumbling structures. The synagogue is in a small lane punctuated with a number of curio shops. Built in 1568, this Jewish Synagogue with subsequent modifications, is likely to go shortly into the hands of the Archaelogical Department of the Government of India as an ancient monument to be preserved for posterity. "That's all - there is no other way." said Mr. Cohen with a sense of inevitability. The story of Jews goes back to Abraham, Moses, David and Solomon and they adhere to Judaism, one of the oldest monotheistic religions. Both Christianity and Islam drew a lot from it. For Jews, Talmud is their Book of Prayer as well as their Code of Conduct and the entire social

fabric with religious observances is bound by it.

It was with a pang of pain we took leave of that beautiful synagogue, paved with a thousand black marble stones imported from China three centuries back, when the steam ship was yet to make its appearance on the high seas and each row of stones in intricate design narrating a lovely tale. And the wooden architecture, the panels, the mosaic on the roof, the place to kneel - those and many more remain forever green in our memory.

The first advent of Jews into Indian took place in 72 AD. And from Persia it was in the 4th and 5th centuries. In 1344 the Jews came to Cochin from Spain and Portugal and started settling down on the Malabar Coast.

With a heavy heart we took leave of the Cohen Couple and as we got into the vehicle Radha said "You are moved by the beauty and enchantment of that synagogue -- that's why you are so silent. Didn't I tell you several times that you both should come to Ernakulam at least to see this particular place of immense value?"

"Yes, Madam, but for you we would have missed a rare opportunity - blended with pleasure and anguish. As you and Mr. Sivaswamy know Mr. Cohen personally, he took such abundant care to explain to us every small detail," I said, as the car was speeding towards St. Francis Church situated in the Fort Area.

While we were making rounds to find out the exact location, some school children came to our rescue and showed us the way. The history of this Church in Cochin reveals to us the story of European Colonialism. As we all know, Vasco-de-Gama discovered the sea-route to India and landed at Calicut in 1498. Two years later the Portugese trade ships came to Cochin and by 1503 they could manage concessions from the Raja of Cochin to construct for themselves a fort as a trading centre and within the fort they constructed a church. It was St. Bartholomew's to start with and later it was St. Francis' and St. Anthony's. Whatever be the name that church belonging to the Order of St. Francis was there till 1663. When the Dutch stepped in, they ordered the earlier

priests to quit and in a spirit of reformation, they converted St. Francis Church as the Government Church demolishing all other minor ones. In 1779 it was renovated. As the British captured Cochin in 1795, they took possession of this church and in 1804 it assumed the name of Anglican Church and slowly passed on into the hands of Ecclesiastical Department of the Government of India. And the Government of India in the fiftieth year of the reign of Queen Victoria (1887), thought it fit to repair the old decaying building and in 1924, it came under the Protected Monuments Act of 1904. The boundary walls were erected in 1924. Since 1947 this St. Francis Church is under the control and supervision of the Church of South India. While worship is done every Sunday, on other days it is open to tourists and visitors.

This Church is well kept and a sense of serenity envelops you as you enter the premises. On the right-hand farther corner, you will find the tombstone of Vasco - de - Gama who died on the Christmas eve of 1524 and was buried here and his mortal remains were shifted to Portugal after being kept in Indian for fourteen years.

We came to the waterfront to watch the Chinese fishing nets. Catching fish is a passion and a paying proposition and even young boys partake in it The Chinese fishing nots bring in a very good catch and sea-food industry is a major one in Cochin. Racing of the fishing boats is a sight to see. Strikes are so common in Kerala that nobody feels perturbed. That evening it was a fishermen's strike. All the boats rushed to a spot where they would meet their strike leaders and evolve the strategy. It was the usual problem of trawlers and fishermen's country boats and mechanised ones, as to the area of their operation.

"You will have a look at the furniture of Kerala - a marvel in wood. It is nearing six - only fifteen minues," said Radha and took us to Manuel & Co. The different wood-pieces looked like embodiments of grace, exquisite workmanship and unusual charm. The junior proprietor was exceedingly courteous to us in showing different items. "We are here, not to make any purchase - we just came in to see and appreciate the

craftsmanship," said Malati. Mrs. Sivaswamy (Radha) was known to them earlier and he thanked us for stepping in to have a look at the various items.

We reached home at six-thirty and had a change. As we were relaxing, Mr. Rami-reddi of Pamarru (Krishna Dt.), a family friend of the Siva-swamys, came in to greet us. He is working as a Reader in the Cochin University and is actively associated with the Andhra Association of Cochin. We are to spend the evening of the 29th with their members at the Hotel Woodlands. Soon Sivaswamy joined us, explaining how he could not make it for lunch. And all the five of us were chatting on umpteen subjects till eleven in the night and we earnestly hoped that Mr. Ramireddy would catch the last bus instead of trekking all the way home - about 8 Km or so. Next morning we are to leave for Malampuzha Dam about 14 km from Palghat where Siva-swamy had some official work. Palghat is 153 km from Ernakulam and you pass thro' Trichur which is on the Coimbatore - Salem Road.

**—NR Chendur**

*(to be continued*

# ఓబుల రెడ్డి కుమార్తె వివాహం



దక్షిణ భారతదేశం పారిశ్రామిక వేత్తలంటే మొట్టమొదట గుర్తువచ్చే పేరు తనదిగా వేసుకున్న, హుందా కలిగిన పారిశ్రామిక వేత్త నిప్పో అధినేత. శ్రీ పి ఓబుల రెడ్డిగారి తనయ రోహిణి; సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా వుండి కూడా పెండ్లిపత్రికలో తన పేరును సింపుల్‌గా 'ఇవి రామిరెడ్డి, హైదరాబాదు' అని వేసుకున్న నిగర్వి. జస్టిస్ వెంకట్రామరెడ్డి కుమారుడు భరత్ వివాహం 3 తేది రాత్రి మద్రాసు విజయ శేష్‌మహల్‌లో అత్యంత వైభవంగా జరిగింది.

పారిశ్రామిక వేత్తగా ఓబులరెడ్డిగారి ప్రతిష్ట ఆయనవలె బహు పొడుగైనది. ఆయనకంటే పెద్ద పెద్ద పరిశ్రమలు పెట్టిన తెలుగువారుండవచ్చుగాని, ఆయనవలె విశిష్టమైన హుందాతనాన్ని సంతరించుకున్నవారు చాలా అరుదు. ఆ వైశిష్ట్యం పెండ్లి మండపంలోనే ప్రస్ఫుటంగా కన్పించింది. తమిళనాడు, పాండిచేరి ముఖ్యమంత్రులు, గవర్నర్లు, నేదురుమల్లి జనార్ధనరెడ్డి వంటి మంత్రులు, అన్ని పార్టీల నాయకులు, అమెరికన్, జపనీస్ కాన్సలేట్ జనరల్‌లు, దౌత్యాధికారులు, హైకోర్టు న్యాయమూర్తులు, సినిమా నటులతో అంత విశాలమైన విజయశేష్‌మహల్ కూడా ఇరుకైపోయినట్లు కన్పించింది. పెళ్ళికి ప్రజెంటెసుకోని దక్షిణ భారత పారిశ్రామికవేత్త ఎవరూ మిగలలేదనడం అతిశయోక్తి కాదు.

పదహారణాల ఆంధ్రుడి వేషంలో, ధోవతికట్టి పైపంచె వేసుకొని, వాకిట్లోనే నిలబడి వచ్చినవారందరినీ చిన్న పెద్ద తేడా లేకుండా ఒకే పొడుగుదండంతో సాదరంగా ఆహ్వానించారు ఓబులరెడ్డి గారు. పెండ్లి మంటపం అలంకరణ కూడా కొందరు సంపన్నులవలె ఎబ్బెట్టుగొల్పే ఆడంబర ప్రదర్శనగా కాకుండా సింపుల్‌గా, ఆకర్షణీయంగా చేశారు. షేక్ చినమౌలానా బృందం నాదస్వరంతో చెవులకు, మంచి భోజనంతో జిహ్వకు కమ్మటివిందు చేశారు.

—'జమీన్ రైతు'

సౌజన్యంతో



నాలుగు రోడ్ల కూడలిలో నిలబడి 'శాంతి కావాలి' అని గొంతు చించుకు అరిచినంత మాత్రాన, మన అభిప్రాయాలకు వ్యతిరేకంగా వున్నవారి బుర్రలు బద్దలుకొట్టినంత మాత్రాన 'శాంతి' అవతరించదు.

—పండిట్ నెహ్రూ



సీరియల్

# మధుస్వప్న శాఖ

## పూజిత

మంగళ వాద్యాలు మ్రోగుతున్నవి. మనోహరమైన ఆ మంగళ వాద్యాలకు హారతి పట్టినట్లు దేదీప్యమానంగా వెలిగి పోతోంది ఆ భవంతి..... కళ్యాణ శోభతో కళ కళ లాడుతున్న భవనం చుట్టూ ఎత్తుగా పెరిగివున్నది అశోక చెట్లు. ఆ అశోకచెట్లకు అలంకరించిన రంగు రంగుల దీపాలు, నక్షత్రాల్లా తళ తళ లాడి పోతున్నవి.

నడిరేయి దాటి వేకువ నాలుగు గంటలు కావస్తున్నది. ఊరింకా మేల్కొలేదు. కానీ ఆ ఇంట మాత్రం ఎవరూ నిద్రపోలేదు. ఆనందమంతా సొంతమైనట్లు సందడి చేస్తున్నారు.

ఏకైక పుత్రిక లావణ్యకు తల్లిలేని కొరత కనిపించకుండా, ఏ లోటూ రానీయ కుండా అపురూపంగా పెంచాడు శ్రీనివాసరావు.

తల్లి స్వర్గస్తురాలై పదేళ్ళు దాటింది. లావణ్య ఎం.ఎ. చేసింది. చదువులో సంగీతంలో ఎన్నో బహుమతులు పొందింది.

ఎదురింటి ప్రసాదరావుగారింటిలో విడిదికి దిగినారు మగపెళ్ళివారు. వారికి ఏ కొరతా రానీయకుండా ఘనమైన ఏర్పాట్లు చేయించారు.

వరకట్న సమస్య ఏ మాత్రం లేదు. ఇరువైపుల వారు సంపన్నులు - సకల ఐశ్వర్యములు గలవారు.

పెళ్ళికొడుకు చుట్టూ చేరిన యువ కులు జోకులు వేస్తూంటే నవ్వుల గల గలలా ప్రతిధ్వనిస్తోంది.

లావణ్యకు మంగళస్నానం చేయించి, ఆ సుకుమారి నడవలేదేమో నన్నట్లు ముత్తయిదువులు చేయిపట్టి నడిపించి తీసుకొచ్చి - సాంబ్రాణిపొగ వేసి కురులార్పి, కాళ్ళకు పారాణి పెట్టి నుదుట సిందూరం దిద్దారు. జడవేసి పువ్వులు కుట్టారు - నగలు అలంకరిం చారు.

## 2

పెళ్లిపీటల కూచోనున్న వధూవరు లని కళ్లనిండుగా చూసుకు ఆనంద పడుతున్నాడు శ్రీనివాసరావు.

ప్రత్యూష పవనాలు అల్లనల్లన సాగుతున్న శుభోదయ వేళ, ఉదయ సంధ్య వింతసోయగాలు వెదజల్లే తరుణంలో, విశాల తలుపు తెరచుకుని బయట బాల్కనీలోకొచ్చింది.

సూర్యారావు, ప్రమీలలకు ముగ్గురూ ఆడపిల్లలే.... విశాల పెద్ద

మ్మాయి రెండోమ్మాయి విమల, మూడోది శర్మిల.

ఆ ఇంట్లో విశాలకు తప్ప మిగతా ఇద్దరికి త్వరగాలేచే అలవాటు లేదు. కాలేజీకెళ్లే ముందు లేచి, తెగ హడా వుడి పడిపోతుంటారు. తల్లి ఎన్నిసార్లు చెప్పినా వినిపించుకోరు.

సివిల్ ఇంజనీరింగు ఫైనలియర్ చదువుతోంది విశాల. అతి కష్టంమీద ఇంటర్ పాస్ అయి బి.ఎ. లో చేరింది విమల. శర్మిల ఇంటర్ ఫస్ట్ ఇయర్‌లో ఉంది - ముగ్గురివీ మూడురకాల మనస్తత్వాలు.

తల్లి ఇచ్చిన కాఫీ తాగుతూ కూర్చుంది విశాల. అప్పుడే పేపరు బోయ్ పేపరు వేసి వెళ్ళాడు. సగం తాగిన కప్పు పక్కనపెట్టి, పేపరు చేతిలోకి తీసుకుని, మొదటి పేజీలోనే ఇంతింత పెద్ద అక్షరాలతో వున్న వార్తకు స్తంభించి పోయింది.

ఫోను దగ్గరకు పరుగెత్తింది.

"హలో" నిద్ర మత్తుగా పలికింది అవతలి గొంతు.

"స్టుపిడ్, పేపరు చూడు,....లండన్ నుంచి వస్తున్న ప్లేన్ క్రాషయిందట."

"మైగాడ్" అంటూ చందన అరవ డంతో, తల్లి రాజేశ్వరి, గ్రాండ్‌మదర్ శాంతమ్మ హడావుడిగా వచ్చారు.

"గ్రాండ్‌మా ! అన్నయ్యా...." చెపుతూనే ఏడ్చేసింది చందన.

"ఏమయింది.... అన్నయ్యకు ?"

పేపరందుకుని గబ గబ చూసింది రాజేశ్వరి. లండన్‌లో బయలుదేరిన ప్లైన్ క్రాష్ అయిందని, నూటఇరవై మంది చనిపోయారనీ, అరవయి మందికి దెబ్బలు తగిలి ఆస్పత్రిలో వున్నారనీ వార్త.

చందన తండ్రి రాజశేఖరం ఊళ్లో లేరు.... వ్యాపార రీత్యా బొంబాయి వెళ్ళివున్నారు. ఏమి చేయాలో తోచటం లేదు. ఇంతలో విశాలో వచ్చింది. ఆమెను చూస్తూనే పెద్ద పెట్టున ఏడ్చేసింది చందన.

"చందనా.... ఇప్పుడు హిందీలో న్యూస్ వచ్చే టయమయింది. టి.వి ఆన్ చేయి"

టీ. వి ఆన్ చేసారు.

హిందీ న్యూస్‌లో, ప్లేన్ క్రాష్‌లోని కొందరి పేర్లు చెప్పారు - అందులో నాగారున పేరు లేదు.

లిప్తపాటు అందరి ముఖాల్లో ఏదో ఆశ.

## 3

ముస్తాబు అయిన పెళ్ళికూతురు లావణ్య కళ్యాణ, మండపం దగ్గరకు వస్తున్న సమయంలో పాడిన సన్నాయి పాట ఎంతో శ్రావ్యంగా వుంది. ముత్త యిదువులు అమెకిరువైపుల నిలుచుని నడిపించుకొస్తున్నారు.

అడుగులో అడుగువేస్తూ, హంస నడకల లావణ్య వస్తుంటే, ఆమె పద మంజీరాల సవ్వడి, చిరు గంటల నాదమై, ఏ దేవకన్యో దిగి వస్తు న్నట్లుగా వుంది.

రకరకాలపువ్వులతో అలంకరించిన కళ్యాణ మంటపం దగ్గరగా వచ్చి కొంచెం కనులెత్తి చూసింది. పసుపు

కుంకుమ, మంచిగందం, మల్లెపూవుల సువాసనలు.

ఆమె నయనాలు బరువుగా నేల వాలి అరమోడ్పులయాయి కళ్యాణ మండపంలో కూర్చోపెట్టారు.

ప్రక్కనే కూర్చుని వున్న పెళ్ళి కొడుకు తల తిప్పి లావణ్యవైపు చూశాడు. ఆమె అందానికి అతను ఆనందభరితుడవుతున్నాడు.

దగ్గరకు వంగి, "మీరు దేవకన్య లా వున్నారు" అని చిన్నగా చెప్పా లనుకున్న నాగేష్, పురోహితుని పిలుపుకు అటువైపు తిరిగాడు. పెళ్లికొడుకు చేతిలో ఏదో పెట్టి అగ్నిలో వేయమని చెప్పాడు పురోహితుడు - అతను చెప్పినట్లే చేస్తున్నాడు నాగేష్.

పురోహితుడు మంత్రాలు వల్లిస్తూ, తమ పాకుతో అగ్నిలో నేతిని ధారగా పోస్తున్నాడు. అరమోడ్పులయిన లావణ్య కనులు అగ్ని హెూత్రం మీదకు మళ్లాయి.

ఆ అగ్నిని చూస్తున్న ఆమె దృష్టి, అగ్ని నాలుకల మీద.... కేంద్రీకృత మయింది. తనకు తెలియకుండానే, తన ప్రమేయం లేకుండానే, ఏదో ఉపద్రవం తన మీదకి దూకుతోంది.- తన శరీరం వశం తప్పుతోంది. ఏమవుతోంది తను ? వివాహమంటు

## ముఖచిత్రం

భరతనాట్యం, కథక్, మణిపురి, కథాకళి, కూచిపూడి, ఒడిస్సీ, పేరిణి యిత్యాదులు అయా ప్రాంతాలకు చెందిన భారతీయ నృత్యములని చెప్ప వచ్చు. అన్ని నాట్యరీతులకు మూలం 'అభినయ దర్పణము', 'హస్త లక్షణ దీపిక' అని చెబుతారు. మహాకవి వల్లథోల్ పూనుకోవడం వల్ల, 'కథాకళి' ఈ శతాబ్దిలో బహుళ ప్రచారంలోకి వచ్చింది. దీనికి 'కొత్తరక్కర' రాజు (1575-1650) మూలపురుషుడని అంటారు. మూడుశతాబ్దులుగా 'కథాకళి' కేరళలో ఆదరణ పొందుతున్నా, సామాజిక గౌరవమూ, గుర్తింపూ, వల్లథోల్ వల్లనే వచ్చాయి. పాత్రల వేష ధారణలో ఒక ప్రత్యేకత ఉంది. రామాయణ, భారత కథలనే, వీరు నృత్య నాటకాలుగా ప్రదర్శిస్తారు. భరతుని నాట్యశాస్త్రం మూలగ్రంథ మైనప్పటికీ, తమకు అనుకూలంగా హస్తముద్రల విషయంలో మార్పులు చేసుకున్నారు. ఈ మార్పులు కథాకళికి విశిష్టత చేకూర్చాయని కొందరంటారు. The Language of Kathakali అనే గ్రంథంలో ప్రేమ్ కుమార్ అనే కళాకోవిదుడు ఈ నాట్య పద్ధతిలోని ఉద్విగ్నత, వేగమూ, శబ్ద సౌష్టవమూ భావప్రకటన యిత్యాదులు ఎంతో విపులంగా చెప్పాడట.

పంలో ప్రజ్వలిస్తున్న అగ్ని, చితి మంటలను గుర్తు చేస్తున్నదేమిటి? ఏమిటీ వైపరీత్యం? తనెవరు? అగ్ని కీలలలో ఆ భయంకరాకృతి ఏమిటి? శరీరమంతా భారమై, మనసూ మెదడూ మొద్దుబారి, కళ్ళుమూసుకుపోతున్నట్లని పించి, చుట్టూ కలయ చూసింది.

అంతా అల్లకల్లోలంగా వుంది జరిగే దేమీ ఆమె కళ్ళకు కనిపించటంలేదు. ఏవో స్మృతులు ఉప్పెనలా తనని విసిరేస్తున్నాయి.

తమాయించుకుందా మనుకున్నా సాధ్యం కావడం లేదు. పక్కనే నిల బడిన ఆమెతో, "నాకెలాగో వుంది - కూర్చోలేను" అంటూ లేవబోయింది.

"అదేమిటమ్మా! ఇప్పుడు పీటల మీద నుంచి లేవకూడదు"

"వుహు.... ప్లీజ్. కూర్చోలేకుండా వున్నాను"

లేవపోతున్న లావణ్యను బల వంతంగా కూర్చోబెట్టారు.

అప్పటికే కంగారుగా చూస్తున్న పెళ్ళికొడుకు వైపు తిరిగి.... "ప్లీజ్, నాగేష్, ఈ పెళ్లి ఆపుచేయించండి. నాకు ఎదోలా వుంది" అంటూ పెద్దగా ఆర్తనాదం చేసింది లావణ్య.

తెలబోయాడు నాగేష్.

"అమ్మా, లావణ్య, ఏమయింది తలీ?"

"ప్లీజ్, డాడీ, నన్నేమీ అడగవద్దు. నాకీపెళ్లొద్దు" - జీర బోతున్న గొంతుతో పలికి, అక్కడే పీటల మీద స్పృహ లేకుండా పడిపోయింది లావణ్య.

ఒక్కసారిగా మంగళ వాద్యాలు ఆగి పోయాయి. పెళ్ళి పందిరంతా క్షణం మూగపోయినట్లయి పోయింది.

అందరి ముఖాల్లో ఆశ్చర్యం.

"అమ్మా ! లావణ్యా...." అంటూ దీనంగా పిలిచాడు శ్రీనివాసరావు. లీలగా ఆమె చెవుల పడుతోంది గాని సమాధానం.... గొంతు నుంచి పెగల డం లేదు.

ఆ అగ్ని గుండం, సమిధలు కాలిన వాసన, ఆమెని జాగ్రదా.... వస్థకు దూరం చేస్తున్నాయి. సొమ్మసిల్లినట్టుగా అచేతనంగా పడిపోయింది.

అప్పుడు మొదలయ్యాయి గుస గుసలు. ఏమికథ ? ఏమి జరిగింది ? అందంతో బాటు ఆత్మసౌందర్యమూ, మంచి చెడ్డల అవగాహన గల లావణ్య ఎందుకిలా చేసింది ? ఆమె యిష్టా నిష్టాల ప్రమేయం లేకుండా ఇది సంభ వించిందా ? ఎవ్వరికీ బోధపడటం లేదు. మతి చలించిందన్నారు మగ పెళ్ళివారు.

మతి భ్రమించి నట్టుంది - అని కొందరు అంటే, ఏదో నాటకంలా వుంది" అన్నారు మరి కొందరు.

'ఏదో లవ్ స్టోరి నడిచివుంటుంది ; తండ్రిమాట కాదనలేక .... ....

"అహా ; కాదండి ... ముమ్మాటికి ఇది మెంటల్ కేస్, ఈమధ్యనే ఒకకేసు ఇలాంటిదే చూశాను...." .... "కట్నం ఇస్తే చచ్చినా ఈజన్మలో పెళ్లి చేసు కోనని తండ్రితో చెప్పిందాకమ్మాయి. ఆతండ్రి వెతికి, వెతికి ఒక అబ్బాయిని పట్టుకొచ్చి, కట్నం సంగతి ఆ అమ్మాయికి తెలియకుండా ఏర్పాటు చేశాడు, పదివేలు తక్కువైందని. పెళ్లి పందిట్లో పెళ్లికొడుకు తల్లి గుసుస్తూన్న సమయంలో పెళ్లికూతురికి అది తెలిసి పీటలమీద నుంచిలేచి ఉగ్రరూపంతో, ఆపెళ్లికొడుకుని, ఆతల్లిని, చేతికందినవి పుచ్చుకు విసిరికొట్టి తరిమేసింది. తరువాత ఆపెళ్లి ఆగిపోయింది." ఇలా ఎవరికి తోచిన ఊహాగానాలు వారు చేస్తున్నారు.

"హూఁ ఇప్పుడొస్తున్న సినిమాలు చూసి నేర్చుకుంటున్నారు, బాబూ, ఈ కుర్రకారు...."

"ఈ తల్లి దండ్రులు ఇంతేలేండి. కన్నబిడ్డల మనసెరక్క తమ పరువు ప్రతిష్టలు.... ముఖ్యమని బలవంతంగా .... కట్టిబెడతారు...."

"మెంటల్ కేసే అయి వుంటుం దండి"

ఈ అభిప్రాయ పరంపరని పట్టించు కోని శ్రీనివాసరావు, మంచం మీద పడుకోబెట్టిన కూతురివైపు శ్రద్ధగా చూస్తున్నాడు. కనుకొలకుల్లో సన్నటి నీటి తెర అలముకుంది. ప్రేమకు ప్రతి రూపం అయిన తనకూతురు లావణ్యకు ఇలాంటి విషమ పరిస్థితా....? ఏమిటీ .... వైపరీత్యం .... ? ఎందుకు జరిగిందిలా... ?

వాడిన పూలదండలా పడివుంది లావణ్య.

## 4

"ఎక్కడికెళ్ళింది నీ ముద్దుల కూతురు ?" - టిఫిన్ తింటూ .... అడిగాడు సూర్యారావు.

ముద్దుల కూతురు, అనేమాట మనసులో ముల్లులా గుచ్చుకుని, నిట్టూర్చి మౌనంగా వుండిపోయింది ప్రమీల.

"ఇదిగో ఎంత మోడరన్ అయినా అలా వేళాపాళా లేకుండా తిరుగనీయ వద్దు."

క్షణం అతనివైపు చూసింది.

"ఏమిటలా చూస్తున్నావ్ ? వినిపించలేదా నే చెప్పింది .... ?"

"అలా వేళ గాని వేళ తిరిగేదే అయితే, నెనెప్పుడో .... ఖండితంగా .... చెప్పివుందును."

"నేను స్టెప్‌ఫాదర్ని గనుగ తప్పు పడుతున్నానని నీ వుద్దేశమా ?"

"నేనెప్పుడూ అలా అనుకోను," అంటూ చురుగ్గా అతనివైపు చూసింది ప్రమీల.

అనాదిగా మగవాడు పలుకుతున్న పలుకులే ఇవి.

సూర్యారావు ఆఫీసుకెళ్ళిపోయాడు. ప్రమీల అన్యమనస్కంగా కూర్చుంది.

(ఇంకాఉంది)

# 'వసంత సంచిక'

పన్నీటి కాలువలు, వట్టి వేళ్ల దడి గట్టి శ్రీ గంధంతో మెత్తడం, కర్పూర వేదిక, చల్లని చెంగల్వ రేకుల సజ్జ, గొజ్జంగి పూవు తలగడ అమర్చి, సర్వశైత్యోపచారాలు చేశారట ఆ ప్రబంధ నాయికకు ('కళాపూర్ణోదయం'). ఎసి. రూములు, రబ్బరు మ్యాట్రెస్‌ల కాలంలో నిజంగా సాహితీ సుధే ఆ సీసపద్యం ... "సీహారాంచల నిభృత నిశాంతా.... విరతర పథిక! ప్రియ తమ ప్రేమిక!.... ఓహో. వసంతా! ఒయి వసంతా!.... మధుర మధురమై రేయము మా - మరుగు టెదలలో నిండెనులే' - ఎవరనగలరు ఆ మాటలు - ఒక్క కృష్ణ శాస్త్రిగారే .... "వసంత రధ చోదకుడు కోకిల - కోకిల స్తోత్ర పాఠకులు కవులు" అన్నారు బెజవాడ గోపాలరెడ్డిగారు ....1957లో బందరు నుంచి లోక్ సభకు ఎన్నికై, 1962 లో మళ్లీ పోటీ చేసినప్పుడు, రెండు వేల వోట్ల తేడాతో ఓడిపోగా, కాంగ్రెసు లోని యువకులు చింతిస్తూవుండగా, "మనం దేశంకోసం పనిచేసేవారము. కార్యకర్తలకు గెలుపేమిటి, ఓటమేమిటి?" - అన్న మండలి వెంకట కృష్ణారావు గారు ఆదర్శ ప్రాయమగు ప్రజానాయకులు. అటువంటి సేవా తత్పరులు ఆనాటికానాడు అరుదవుతున్నారు.... "మనలో చాలామంది బస్సుస్టాండు మనుషులం .... జీవితంలో మనకు కలిగే ఉత్సాహం అంతా బస్సు సక్రమంగా ఎక్కి గమ్యస్థానం చేరడంలో ఖర్చుఐపోతుంది రోజూ.... క్రికెట్ ఆడి సెంచరీలు కొట్టాలనీ, టెన్నిస్‌లో కృష్ణన్‌ని ఓడించాలనీ, మంటల మధ్య నుంచి చంటిపిల్లలను, ఆడవాళ్లని, ముసలివాళ్లని రక్షించాలని ఉంటుంది గాని యిలాటివి మనకు జీవితంలో సాధ్యపడవు గనక సినిమాల్లో చూసి ఆనందిస్తున్నాము" - అని తురగా కృష్ణమోహనరావుగారు చెప్పినది అక్షరాల నిజం.... తేనెలూరే పాటలు రచించే సిరివెన్నెల సీతారామశాస్త్రిగారు ధావళ్యలలోని రంగులని హృద్యంగా చెప్పారు తమ కథానికలో. కేసరిగారి 'చిన్ననాటి ముచ్చట్లు' స్మృతిమాలే కాదు, సాహిత్య సామాజిక చరిత్ర.... 'డైరీ' మొదలైన వాటి గురించి కొత్తగా చెప్పేదేమీ లేదు.... వసంత సంచిక (జగతి) ప్రత్యేక వరవడిలో ఉంది.

—కె రామ్మూర్తి
విశాఖపట్నం-2



